# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

ఆగస్టు 1976

సంపుటము : 53 సంచిక : 8

విడిప్రతిక వెల రూపాయిన్నర

# వన్యమృగ సంరక్షణ : నూతన దృక్పథం అవసరం

నేడు వన్యమృగాలు చాలా తక్కువగా ఉన్నాయి. వాటికి తగిన రక్షణ చాలా అవసరం. చట్ట విరుద్ధమైన వేట, వలవేయడాన్ని అరికట్టడంలో మాకు తోడ్పడండి. వన్యమృగ సంరక్షణలో మీ సహకారాన్ని కోరుతున్నాం.

1972వ సంవత్సరపు వన్యమృగ సంరక్షణ చట్టం క్రింద దిగువ చర్యలు నేరంగా పరిగణించబడతాయి. ఈ చట్టం 1973 ఆగస్టు 1వ తేదీనుండి ఆంధ్రప్రదేశ్‌లో అమలులో ఉంది.

1. అటవీ ప్రాంతాల లోపలగాని, వెలుపలగాని లైసెన్సు లేకుండా వేటాడడం చట్టవిరుద్ధం.

2. పెద్దపులి, చిఱుతపులి, నల్లజింక, తోడేలు, అడవిదున్న, మొసలి, నెమలి, జాతి కొంగలను వేటాడడం పూర్తిగా నిషేధించబడింది. చట్టాన్ని అతిక్రమించిన వారికి ఆరునెలలనుండి ఆరు సంవత్సరాలవరకు జైలుశిక్ష, రు. 500 లకు తక్కువ కాకుండా జరిమానా విధిస్తారు.

3. చట్టంలోని 1వ షెడ్యూలు 2వ షెడ్యూలులోని రెండవ విభాగంలో నిర్దేశించిన పెద్దపులి, చిఱుతపులి, నల్లజింక, నెమలి, మొసలి, యితర జంతువులనుండి లభించిన ఉత్పత్తులను, మృగాల వస్తువులను, ట్రోఫీలను కలిగివున్న యజమానులు ఆ విషయాన్ని ప్రకటించాలి.

4. లైసెన్సు లేకుండా వేటాడి పట్టుకున్న జంతువులు, జంతువుల వస్తువులు ట్రోఫీలలో గానీ, వన్యమృగాలనుండి పొందిన మాంసం విషయాలలోగానీ వ్యాపార వాణిజ్యాలు జరపడం చట్టవిరుద్ధమైన చర్య.

5 లైసెన్సు లేకుండా వన్యమృగాలనుండి పొందిన మాంసాన్ని వండడం, వడ్డించడం, నిషేధించబడింది.

6. లైసెన్సు డీలర్లనుండి వన్యమృగాలను, పక్షులను, జంతువుల వస్తువులను, ట్రోఫీలను కొనుగోలు చేయడం చట్టవిరుద్ధమైన చర్య. అటువంటి వాటిని కొనుగోలు చేయవద్దు.

7. లైసెన్సు లేకుండా వన్యమృగాల ట్రోఫీలు, చర్మాల వ్యాపారం చట్టవిరుద్ధమైంది. యిటువంటి చర్యలనుగూర్చి తెలిపేవారికి తగిన బహుమతి యివ్వబడుతుంది.

* అంతరించిపోతున్న మన వన్యమృగ జాతులను సంరక్షించడంలో మాకు తోడ్పడండి. దొంగతనంగా వన్యమృగాలను వేటాడేవారిని గూర్చి, వన్యమృగాలను చంపేవారిని గూర్చిన సమాచారాన్ని సమీపంలోని అటవీశాఖాధికారికి గానీ, వన్యమృగాల ఛీఫ్ వార్డెన్‌కు గాని తెలియజేయండి. మీకు ఉచిత బహుమతి లభిస్తుంది.

** పెద్దపులి, చిఱుతపులి చంపిన పశువుల యజమానులకు నష్టపరిహారం చెల్లించబడుతుంది. సమీపంలోని అటవీశాఖాధికారినిగాని, వన్యమృగ ఛీఫ్ వార్డెన్‌ను గాని సంప్రదించండి.

*** ఇతర వివరాలకు సంప్రదించండి :

వన్యమృగ ఛీఫ్ వార్డెన్, అడవుల అదనపు ప్రధాన సంరక్షణాధికారి,
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు-500004.
(ఫోన్ నెం : 30531)

No : 18/C3 76

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1976





# వసుమతి కిరీటంలో తురాయిపూలు...

**శ్రీ సోమసుందర్**

అలనాటి చీకటి వేకువలో

అలా ఎందుకన్నారబ్బా, గురుదేవులు? [1]
నేడు నా జాతికెన్నో నవ్యోషస్సులు...
చూడు తెరలి తెరలి సాగే తాజా ఉగాదులు!

వస్తూనే కొత్త తళతళలతో ఈ వసంత ఉదయం
పూస్తూ పూస్తూన్న పల్లెల్ని, ఎర్రెర్రని మోదుగల్ని
అందుకే కాబోలు తెచ్చింది పాదపాలలో సహా!

ఈ పురాణ భవంతిని ప్రేతాలవలె
వదలని చీకటి తెరలు
దర్జాగా ప్రజల రక్తాన్ని పీపాల [illegible]
తాముగా వచ్చి జరుగుతున్నాయి!
ఎలంటరీ డిస్క్లోజర్!
వర్తమానం మస్తకంపై ప్రేలాడే బూజులు
రేపటి ప్రత్యూషంలో సురభిళిస్తాయి బాజాలుగా!
నిజ జీవితారోహణంలో
ఉద్యమోత్సాహ భంజకాలు
నేడు మటుమాయమవుతూన్న పాత కంటకాలు!

పరభాగ్యోప జీవుల వందిమాగధులైన
పాత కవిగాళ్ళ అవకాశవాదిరాంధోళ్ళ
జీవిత్యం ఎరుగని సుఖభోజనంగా [illegible]
ఉగాది వస్తోందనగానే అంతరించేదేం [illegible]?
పాత నాగరికతా పురోభాగులైన [illegible]
హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నారా —
పహారాల పరిరక్షణలో!

నిన్న జ్ఞాపకం ఉందా?
టోపీ చంకక్రింద దాచేసుకుని
దొంగలా [illegible]
ప్రొహిబిషను కానిస్టేబు [illegible]
నిర్బంధంగా తీసుకుంటున్నాడా విశ్రాంతి?

## 2

ఈ ఉగాది చిత్రమేమిటోగాని
కాల కర్కోటకుని కాటందుకుని
కలరూపు చెడిన సమస్త భయంకర బాహుకుల్ని
శాప విముక్త పునరుజ్జ్వలిత మానవీయులుగా
రమణీయ నిషధేశ్వరులుగా మార్చింది!
సౌదామనుడు నలుడై మంగళాకారుడై
సాక్షాత్కరిస్తున్నాడు సర్వత్రా!
నిన్నటి దండకారణ్యాల్ని
సంగీత స్వగత సుందర వనాలుగా తీర్చింది!
పాతకవుల పాడుం బుర్రలలో [illegible]
కస్తూరికా పరిమళాల గుబగుబలే!

నిన్నటి లొచ్చుగుంటల ఫోటోగ్రాఫర్లు
నగర హేమంత నిశీథాల లోపల్ని
వన జ్యోత్స్నా[2] కుసుమోత్సవాల కోసం
అన్వేషిస్తున్నా రనారతంగా!
వినోద బ్రహ్మ సంహితాల తావిల పాటలు మోసే —
ఖరదూషణాలు కాలేక
నవ వర్ణాంతరాలు గమనిస్తున్నారు!

నిరుటి నిదాఘంలో అగ్నేయాయా
ఎందుకో చెప్పు చెయ్యకుండా విద్యుత్ మరయంత్రాలు
గాలి స్తంభింపిందా, స్వేదం స్తంభింపిందా?
గ్రీష్మం దాహ సంతప్తంగా లోకాన్ని కాల్చిందా
జ్ఞాపకముందా?... ఇదేమిటో చిత్రం ఈసారి
ఎండా లాగడం లేదు. దీపాలారడం లేదు;
కుశాంబూల విలాయితీ మారింది!

నేడు లోకం కొత్త శోకులతో మెరిసింది
మా పెరట్లో పొగడ చెట్టు కొత్త యుబ్బులలో మునిగిపోయింది...
అందుకనేనా అన్నాడా కృష్ణుడు?[3]
సాక్షాత్తు వ్యాస సంతతి వాడు—
"ఇది అనుశాసన పర్వ మర్రా"— అని!

## 3

ఇంత చిక్కని చీకటి నిశ్శబ్దంలో
మొక్కలు చేసే ఆ గుసగుస లేమిటో కనిపెట్టు...
చంద్రా జపాకుసుమాల్లారా,[4]
అవి నక్షత్ర వీరాయి కింకర్లు కావు కదా ?
అప్రమత్తంగా ఉండాలిప్పుడు, లయవ్యాసంగా ఉంది.

పుడమీ నీ ఒడిలోని కడలిని
నేడు దుర్మోహాలమీద ఒంపు
చెలియలి కట్ట నొక్కసారి అధఃపతించు !
ఖస్సాలా[5] లో మంచేతుల పగిలిన
విరిగిన గాజుల మోసులు మళ్ళీ ఇక్కీ ఉగాది పూవుల్లై
వసుమతీ, ఏ ఒడిపై పూయునో, ఈ వసంతాన?

యమునా కావేరి నదుల జలక్రీడలాడిన
పురాణ ప్రణయ గాథల గాడులు గాఢంగా
మళ్ళీ ఆక్రోషించుకో రావా ఈ ఉగాదిని?
గంగా గోదావరులు కరస్పర్శ కావించి
నదులనీ, వరులనీ, విరులనీ, తనియించవా?

ఖస్సాలా విషాదగాథ తల్చుకునే నా
మరిగే కెరటాలతో తరిమే నిట్టూర్పులు ?
తోయాల లయలలో నిష్వనించే శోకాలు?
నదుల గుండెల ఒడలి కెరటాలలో ఆశాకిరణాలు ?

## 4

ఈ నవ వసంత మెత్తిన అనుశాసన పర్వంలో
భూజనులంతా భూజాల మాదిరిగా
అహరహం జాగృతులై ఉండాలి !
ఉత్తిష్ఠోత్తిష్ఠ్య బలాఢ్యదండపాణులై
దారుఢ్య గారుత్మత శాఖాచయ గదాధారులై
సుహాస రుచిర లత్తుకారులై
అనవరత జాగరూకులై—ఉండాలి !

పుడమిని గడాబిడించుకొన్న
ఊడల మర్రినింక అటకాయించి
చెంపలేసుకుంటూ పరిమళాల కేదారాలు !

బలవంతాన బీళ్లుగా, ఊషరక్షేత్రాలుగా
మార్చబడిన కంచెల నేడు
రాజనాల రాసులు క్రుమ్మరించే సుక్షేత్రాలు !

ఇంతెందుకు?—నిన్న మా ఊళ్లో
సమస్త భూతలమూ ఒక్కడిదే !
నేడో—సమస్తమూ సమస్త మానవులదీను
పోయిన వత్సరం ముందుగా అంత భయపెట్టిందా
రాక్షసుల విజృంభణతో హత్యలతో
దేశం లతలాకుతల మవుతుందనిపించిందా?
దాని చిత్రం, రసస్పృష్ట శీతల సమీరమై
హాయిగా వీచింది కడకు !
దౌష్ట్యాల పరాకోటిని పదముల క్రింద నొక్కింది.
నిన్న ప్రతి పవమానమూ అవమానాల్నే కురిపిసేనా ?
నేడో జాగృత సమాజ మారుతమై
భారత నవ వసంతారామ మంతటా
నవజీవన చైతన్యంతో తరంగించింది !

## 5

ఈ రసవత్తర క్షణంలో నిటారుగా నిలిచే ఊహాలి
ప్రతిభూజమూ భుజాస్ఫాలనం చేసి...
ఇదిగో...ఇప్పుడే...ఈ దారినే...
వెంచేస్తోంది వసంతం !
లెండి లెండి, స్వాగతం పలకండి !

మాస్కోతో పుంస్కోకిల గొంతెత్తి గానంచేస్తే
భారత శాంతివనంలోని పికీ ప్రణయపంచమం ప్రతిరుతింపించింది!
క్రెమ్లిన్ గోపురాగ్రం నుండి బయల్దేరిన
తెల్లని శాంతి పావురం—విశాల విహాయసమంతటా
పల్లటీలుకొట్టి పచ్చి పచ్చి లాల్ ఖిల్లా బురుజాపై వాలింది
చిరునవ్వులు చిలకరిస్తూ అందరినీ పలకరించింది
గంగా ఓల్గా నదుల తల్పులు ఇదే వసంతంలో
ఆప్యాయనంగా మార్చుకుంటున్నాయి—
తమ కర్ణవతంసాలను పరస్పరం !

బ్రహ్మపుత్ర నదీతీరాన వెలిసిన కథక్ నృత్యం
కృష్ణాతీర కూచిపూడి భామాకలాపంతో
వియ్యమందనున్న నవీన యుగాని కిదేనాంది

గంగాతీర రాంపూర్ ఘరానా [6]
భారత భారతి మకుటదారి సలీమా !
కావేరీనది గమకయుక్తమైన ఒయ్యారాల
వడక వెడగులతో నేడే మన శ్రుతుల మేళవించి
హిమాద్రిపర్వం ఆలపిస్తోంది శ్రవఃపేయంగా !
ఆధునిక భారతి నవసంస్కృతి మహేతిహాసాన్ని
సంపత్సూత్రికలతో విరచిస్తోంది !

## 6

నేటి ప్రతినాయకుడూ ఒక దావూదు [7]
పర్వతాలవంటి గోలియత్ [8] లంతా
గొర్రె పొట్టేళ్ళుగా మడిశారు
విరిగిన శిలాగాత్రాల విడిచారు
కూడబెట్టిన పరకీయ ద్రవ్యసమాహారాన్ని
కన్నీటి బిందువులుగా రాలుస్తూ విడిచారు !
తమకు నిన్న స్వాధీనమైన ఆవరణంలోనే
ఉనాదునకలై ఉచ్చిపడ్డారు భిన్నాభిన్నంగా !

వర్తమాన సామాజిక మానవుడు—డేవిడ్
ప్రజాహిత భుజకీర్తులతో మెరిసే వరుడు
ఇప్పుడే—ఇదే దారినే—వస్తున్నాడు
స్మిత వాసంతికా ద్వితీయుడైన స్మరుడు

నేడు నా తల్లి భారత వసుమతి
నేత్రద్వయిలో సూర్యేందుకాంతుల్ని
సదా ప్రచలిత మెరుస్తున్న అట్లాంటా [8] !
ఈ పురాణ ధరిత్రి నేడు మేలుకొన్న అర్క్ కున్
ఈ నవ్యోత్సాహ చైతన్య వసుమతి జోన్ ఆఫ్ ఆర్క్ [9]
తన కిరీటంలో తురుముకుంటోంది
ఎర్ర ఎర్రని తురాయి పూవుల పంక్తి !

* * *

[టీక :— 1. "నా కుసుమ్బులు లేవు నా కుగాదులు లేవు" అనే కృష్ణశాస్త్రిగారి ప్రఖ్యాత కవితాపాద స్ఫురణ. 2. వన జ్వాలికా కుసుమం : Flame of the forest అని ఆంగ్లంలో పిలవబడే తురాయిపూవుకు శ్రీ కృష్ణచంద్రశర్మ కావించిన అనువాదం. 3. వ్యాససంతతి వ్యష్టుడు అవార్య వినోబాభావే! 4. జపాకుసుమాలు — ఎర్రనిపూవులు. 5. ఛస్నాలా — ఇటీవల భూగర్భ నది జలాలు ముంచెత్తగా సుమారు ఐదువందలమంది పనివారిని పొట్టనపెట్టుకొన్న బొగ్గు గని. 6. రాంపూర్ ఘరానా—హిందూస్థానీ సంగీత పితామహుడు తాన్‌సేన్ కల్పించి వదిలిన వారసత్వం. అది మనోహర విజేత సలీమావంటిది. 7. దావూదు—డేవిడ్‌కు మరో రూపం. అతడు పొట్టివాడు సామాన్యుడు. గోలియత్ కుంభకర్ణుని వంటి పర్వతాకారుడు. రాక్షసుడు. కాని వాడు చివరికి దావూదు చేతిలో చచ్చాడు. ఇది బైబిలు కథ. 8. అట్లాంటా: గ్రీకు పురాణాల ప్రఖ్యాతమైన వీరవనిత. ఆమె నేత్రద్వయిలో సూర్యచంద్రకాంతులు మెరసేవట. ప్రాచీన గ్రీకుదేశంలోని ఆర్కాడియన్ అనే రాక్షసులతో నిండిన అరణ్యప్రాంతాన్ని నిష్కంటకమొనర్చి, ప్రజలకు శుభాలు చేకూర్చిన ప్రజాహిత. 9. జోన్ ఆఫ్ ఆర్క్ జగత్ ప్రసిద్ధ వీరవనిత. శ్రీమతి ఇందిరా ప్రియదర్శినికి ఆరాధ్యదిగా ఆదర్శం. ఎలియట్ వేస్ట్ లేండ్ ప్రచురించిన తరువాత ఆధునిక కవితలకు అధోజ్ఞాపికలతో టీక లివ్వడం ఒక జగత్ప్రసిద్ధ సంప్రదాయం.]



పారియే గురకును పరేశవర్ధనుడు.

... ... ... ... ...

రమణీయమగు పెద్ద రామలింగయ్య
కమలాక్షి నిజరాణి కాంతశరభమ్మ
మమత నిద్దలికిని మక్కువ సుతులు
అమర లింగయ్య వీరయ్య యనంగ
అంద్రగజాండను నమరలింగయ్య
పొందుగా రచియింతు బుణ్యచరిత్ర''.

పైదానినిబట్టి యీ క్రిందివంశవృక్షము నేర్పరుపవచ్చును.




ఈ యక్షగానము మూడాశ్వాసములుగలది, ఆశ్వాసాంత గద్యలో అమరలింగామాత్య అని కలదు.

''ఇదియు శ్రీ విపూరి వీరభద్రేశ
పదయుగళ్ల కవిత్వసారరసజ్ఞ
సిరిమించుగూడూరి సిద్ధలింగయ్య
గురుమూర్తి శిష్యుండు కోమలోన్నసైక
లింగనిష్ఠాపర లీనమానసుడు
జంగమ లింగ ప్రసాద సేవకుడు
పరికింప శ్రీ కూరపాటి వంశాబ్ధి
పరిపూర్ణ చంద్రుండు భవ్యగుణుండు
అరుదొంద నమరలింగయ్య పౌత్రుండు
వరరామలింగయామాత్యు సుపుత్రుండు
లింప శ్రీ అమరేశలింగనామాత్య
మేలుగా రచియించె మేదినిమీద
రమణీయ నాయు పురాణోక్తమైన
క్రమము మొప్పు పార్వతీకల్యాణమందు

# III

## అమరలింగామాత్యుని కాలము

ఈతని కాలము నిర్ణయించుట కాధారము పై యుదాహృత పంక్తులలో గలదు. అమరలింగామాత్యుడు తన తాత అమరలింగయ్య గూడూరి సిద్ధలింగహస్త సంజాతుడని చెప్పినాడు. ఇది వీరశైవ సంప్రదాయము అనగా, సిద్ధలింగయ్య—అమరలింగయ్యకు దీక్షాగురువు.

ఈ సిద్ధలింగయ్య చాలా ప్రసిద్ధుడు. తెలుగున నీతని కృతిగా "సిద్ధలింగనవరత్నములు" అను కృతిగలదు. కన్నడ భాషలోను నితడు కృతులను రచించినాడు. కన్నడ కవిచరిత్రలో నీతని యుదంతము గలదు. అందతడు క్రీ. శ. 1480 ప్రాంతమునందున్నట్లు తెలుప బడినది. అతని శిష్యుని మనుమడగు అమరలింగయ్య అతనికి రెండు తరముల తరువాతివాడు కాబట్టి—పార్వతీకల్యాణకర్త అమరలింగయ్య క్రీ. శ. 1550 ప్రాంతమువాడని నిర్ణయింపబడినది.[1] పార్వతీ పరిణయ యక్షగానకర్తయైన అమరలింగామాత్యుడు క్రీ. శ. 1550 ప్రాంతము వాడగుటచేత పాల్కురికి సోమేశ్వర చరిత్ర ప్రతి వ్రాసిన అమరలింగయ్య క్రీ. శ. 1766 ప్రాంతము వాడగుటచేత వారిరువురు నొకే వ్యక్తులు కాజాలరు.

ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్రమున గూడూరి సిద్ధ లింగము శిష్యుడు—అమరలింగామాత్యుని యిట్లు కలదు:

9. కూరపాటి అమరలింగామాత్యుడు.

విపూరి వీరభద్రేశ భక్తుడు. గూడూరి సిద్ధలింగయ శిష్యుడు. ఇతని పితామహులు అమరలింగయ్య. వీరమ్మ. తలిదండ్రులు శర భమ్మ, పెదరామలింగయ్య 'చినరామలింగయ వీరయ, మల్లయ వీర భద్రయ అనువార లితని పితృవ్యులు. అనుజుడు వీరయ్య ఇతని కృతి పార్వతీకల్యాణము (ప్రా. వి. పు. భా. డి. 1909)

నేను ముందు గ్రంథము నందిచ్చిన (పుట-420) వంశ క్రమమును చూచిన పార్వతీకల్యాణ యక్షగానకర్తయైన, కూరపాటి అమరలింగామాత్యుడు గూడూరి సిద్ధలింగయ శిష్యుడుకాడనియు, ఆ అమరలింగయ్య మనుమడనియు స్పష్టమగుచున్నది. కాబట్టి పై గ్రంథమునందలి వ్రాత సరికాదు—[2]

పార్వతీకల్యాణ యక్షగానకర్త కాలమునకు క్రీ. శ. 1550కి ప్రస్తుత సోమేశ్వరచరిత లేఖక కర్త కాలమునకు క్రీ. శ. 1766కు రెండుశతాబ్దములు కాలవ్యవధి యున్నది. ఇక లేఖకకర్తయే యక్షగాన కర్త యనుకొందమన్న—పైనిచ్చిన వంశక్రమమును బట్టి అది యసం భవము.

యుండెనో లేదో తెలియకున్నది. కాగా బసవనకు తండ్రిగారగు సోమయ్య ఇంకొకడు గలడు :

ఇతడు ప్రౌఢదేవరాయలనుండి, శివరాత్రి కొప్పయ్యగారి ప్రతాపరుద్రునిచే నీయబడి, అతని వంశీయులచే ననుభవింపబడి అనంతరము పోగొట్టుకొనబడిన దోకిపర్తి అగ్రహారమును పొందినవాడు. ఇతడు ప్రౌఢదేవరాయలనుండి అగ్రహారమును బడయునప్పటికి వృద్ధుడై యుండవచ్చునని ఆంధ్రకవి తరంగిణికర్త శ్రీ చాగంటి శేషయ్యగారు చెప్పియున్నారు. అట్లయిన యెడల ఈతని (సోమయ మొక్క) కుమారుడును దాదాపుగ తోంటదార్యుని కాలమునకు సంబంధించినవాడు కావలసి యుండును.

బసవేశ్వరుడు మల్లికార్జునుని గ్రంథమును అంకితముగా గైకొనునాటికి శిష్యులు ప్రశిష్యులు గలవాడు కావున వృద్ధుడై యుండును. మల్లికార్జునుడు యక్షగాన రచనా కాలమునాటికి తాను బాలుడనని స్పష్టముగా చెప్పకొనియున్నాడు. ఇతడే బసవేశుని శిష్యుడై యుండి యిట్టి గ్రంథము ననుసరించి యుండెనన్నయెడల తోంటదార్యుని గ్రంథము రచింపబడిన స్వల్పకాలమునకే ఆంధ్రదేశమున ప్రచారము నందినదని చెప్పవలసి వచ్చును—సోమనాథుని బసవ పురాణము పండితారాధ్య చరిత్ర రచనా కాలమునాటికే ప్రచారము నొందినట్లు, ఇది సంభవమైనచో ని ఏవి 15వ శతాబ్ది అంత్య భాగమందు జీవించియుండెనని చెప్పవచ్చును. ఈ కవి కాలము విషయమై ఇంకను పరిశోధనలు జరుపవలసి యున్నది— (పుట 6)

# VI

పై యుదాహృత భాగమునుబట్టి—మల్లికార్జునుడు క్రీ. శ. 15 వ శతాబ్ది అంత్యభాగమున జీవించి యుండెనని వ్యాసకర్త వ్రాసి, ఈ విషయమై ఇంకను పరిశోధనలు జరుపవలసి యున్నది అని వ్రాయుట యెంతయు సమంజసమై యున్నది. ఇక నీ విషయమును గూర్చి చర్చింతము—

## గురువు పిడుపర్తి బసవనకాలము

తోంటదార్యుడు క్రీ. శ. 1462 ప్రాంతమువాడగుటచేత అతని గ్రంథము మల్లికార్జునుడు అనుసరించుటచేత మల్లికార్జునుడు క్రీ. శ. 1462 కి తరువాతివాడగుట స్పష్టమే—అయితే—ఆవెనుక అతడెంత తరువాతివాడు అనునది మనము నిర్ధారణ చేయవలెను.

అటకె—గురువు పిడుపర్తి బసవన—పిడుపర్తి బసవనయనగానే మనకు — పాల్కురికి సోమనాథుని గ్రంథములు ప్రచారములోనికి వచ్చిన—పిడుపర్తి సోమన మనకు జ్ఞాపకము వచ్చును—అతడు పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణమును పద్యకావ్యముగా చేసినాడు-మల్లికార్జునుని గురువు పిడుపర్తి సోమయ పుత్రుడని అతడు స్పష్టముగా చెప్పినాడు. కాని ఈ పద్యబసవపురాణకర్త సోమయకు-బసవన యను పుత్రుడు లేడు—

సోమయ తన పద్యబసవపురాణమున వ్రాసిన వంశక్రమ మీ క్రింద చూపుచున్నాను:




ఈ తరువాత పిడుపర్తి వంశమున ప్రసిద్ధులు లేరు—

పై వంశవృక్షము ననుసరించి—పిడుపర్తి పెదసోమయకుగాని—సోమనాథునికిగాని—బసవన యను పుత్రుడు లేడు — మల్లికార్జునుని స్పష్టముగా పిడుపర్తి సోమన పుత్రుడు బసవన చెప్పుటచేత—నితడు సోమనాథుని సోదరుడైన పాలనార్యుని పుత్రుడు కాదగును — సోమనాథునికి పుత్రులు లేనందున—తమ్ముని కొడుకుని, దత్తత చేసికొనెనా తెలియరాదు అయినది నిది కేవలము ఊహయే —

## పిడుపర్తి కవుల కాలము

ఈ కవుల కాలము తెలిసికొనుట కొకటేయాధారము — ఈ వంశీయులలో మొదటివాడగు పెద సోమయ కొప్పయ్య గడించిన దోకిపర్తి గ్రామమన్యాక్రాంతమ కాగా దానిని, ప్రౌఢదేవరాయల మూలమున తిరిగి పడసినాడు. ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1422–1447 ప్రాంతమువాడు కావున పెదసోమయ్యయు నాకాలమువాడే—ఇది కవి చరిత్రకారులంగీకరించినదే —

## పెదసోమయ్య కాలము

పెదసోమయ (1422-1447) ప్రాంతమువాడు. ఆతడు శ్రీనాథునికి సమకాలికుడు-ఆతని మనుమడు బసవన-తాతకు మనుమనికి రెండుతరము వెడముగావున నితడు క్రీ. శ. 1490-1500 ప్రాంతమువాడు- ఈతడు — దీక్షాబోధయను గ్రంథమును రచించినవాడు- ఈతని ఇతరరచనలు — పిల్లనయినారి చరిత్ర బ్రహ్మోత్తర ఖండము లభ్యముకాలేదు —

## బసవన కాలము

ఈతనికాలము క్రీ. శ. 1490-1500 ప్రాంతమని తెలిసికొంటిమి - ఈతని కొమారుడే పిడుపర్తి సోమనాథుడు - అప్పుడీతడు - క్రీ. శ. 1500 తరువాతివాడు కావలెను కాని అట్లుకాదు—తండ్రికొడుకు లిద్దరును సమకాలికులైనట్లు, సోమనాథరచితపద్య బసవపురాణమునుండి ఈ క్రింది పద్యములవలన దెలియుచున్నది.

సీ. "హరభక్తి వైదికంబని శ్రుతి విడిచెప్పె
బరిగి సోమేశు డారాధ్య చరిత-
సరవి శ్రీనాథుడా చరిత పద్య ప్రబం
ధముచేసె ద్విపదలు తరము నిలిపి"

గీ. సోమ గురువాక్యములుబెట్టి భీమకవి
గరిమ బసవ పురాణంబు గన్నడించె
గాన పూర్వకావ్యము వేఱుగతి రచింప
వారికాది కావ్యోక్తులు వచ్చినెగడు

క. నీవును సోమేశుని ద్విప
దావళి యర్థములు చేయు మందుబయర్థం
బావం తయుదిగ వీడక
యేవియు మున్నందులేని యుడక కుమారా"[3]

తండ్రియగు బసవనయే కుమారుడైన సోమనాథుని ద్విపద బసవపురాణమును పద్య కావ్యముగా చేయ ప్రోత్సహించినాడని పై పద్యముల వలన—స్పష్టము—అందుచే—పిడుపర్తి సోమనాథుడు క్రీ. శ. 1500 ప్రాంతమువాడు.

పిడుపర్తి సోమనాథుని కాలము క్రీ. శ. 1500 ప్రాంతము ఆతనికి బసవనయను కొమారుడు లేడని, ఆతని సోదరుడైన పాలనాఖ్య పుత్రుడైన బసవనగారిని-ముందు తెలిపితిని—పిడుపర్తి కవుల వంశ వృక్షములో సోమనకొడుకు బసవన లేనందున — సోమన ఈ బసవనను పుత్రునిగా గ్రహించెనను యూహను ముందు తెలిపితిని— అట్లయినా—ఈ బసవన క్రీ. శ. 1530-40 ప్రాంతమువాడగును—

ఈతని శిష్యుడగు మన యక్షగానకర్త మల్లికార్జునకవి. క్రీ. శ. 1530-40 ప్రాంతమువాడు కాదగును—

## మల్లికార్జునకవి

## కూరపాటి అమరలింగామాత్యుడు

ఇంతకుముందు నేను

సలలిత శబ్దసంగతుల చందమెఱుంగను ... ...
... ... ... ... ... ...
... ... ... ... ... సుధీ
తిలకములార.

అన్న పద్యమిరువురి కృతులయందును గానబడుచున్నది యని చూపినాను —

అమర లింగామాత్యుడు క్రీ. శ. 1550 ప్రాంతమువాడు— మల్లికార్జునకవి క్రీ. శ. 1530-40 ప్రాంతమువాడు. ఇరువురును

గమితాతికులు కాబట్టి ఎవరినుండి విషయ గ్రహించిరో తెలుసు కొనుట సులభముకాదు —

మల్లికార్జునకవి ఈ యక్షగానమున-పాల్కురికి సోమనాథుని చరమ దశను-పిడుపర్తి సోమనాథుని — పద్య బసవపురాణమునుండి యదామాత్రకముగా గ్రహించినాడు. ఇదియు నాతని కాలము-క్రీ. శ. 1530-40 ప్రాంతమని తెలుపుచున్నది-ఇది నిర్ణయముకాదు.

భావిపరిశోధనములవలన మార్పువచ్చును — అయినను దొరికిన యుసపత్ములు చూపుట పరిశోధక ధర్మము కావున తెలిపితిని —

# VII

## యక్షగానములోని విషయములు

యక్షగానములోని విషయము లీ తరువాత పరిశోధకులు చేసిన నిర్ణయములను సమర్థించుచున్నవి.

### 1. పాలకురికి గ్రామము-

కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు సోమనాథుడు హెసూరు పండలి 'హాల్కూరికి' వాడన్న వాదము ప్రతిపాదింపగా (1939) దానిని కీ. శే. బండారు తమ్మయ్యగారు, నేనును ఖండించి — తెలంగాణమున పాలకురికియే సోమనాథుని నివాసమని నిర్ణయించితిమి!

ప్రస్తుత గ్రంథము పాలకురికి తెలంగాణము సంబంధిదని తెలుపుచున్నది.

### 2. సోమనాథుని జననీ జనకులు

సోమనాథు డారాధ్య బ్రాహ్మణుడని కీ. శే. కాశినాథుని నాగేశ్వరరావుగారు వృషాధిప శతకము పీఠికలో వ్రాసిరి.[4] కీ.శే. బండారు తమ్మయ్యగారు సోమనాథుని జంగముగా నిరూపించిరి.[5] ఇప్పటిని నేను బసవపురాణ పీఠిక-ద్వితీయ ముద్రణమున — సోమనాథుడారాధ్య బ్రాహ్మణుడనియే నిర్ణయము చేసితిని—

ఈ యక్షగానము పాల్కురికి సోమనాథుడారాధ్య బ్రాహ్మణుడని నిర్ధారణ చేయుచున్నది.

## సోమనాథుని తండ్రి

"శ్రీ పండితారాధ్య శిష్య సంపత్తి
ప్రాపగున విష్ణురామిదేవుండు
నారాధ్యలోక పట్టాభిషేకుండు"

అని స్పష్టముగానున్నది-సోమనాథుడే—తన చెన్నమల్లు సీసములలో "ఆరాధ్యవిష్ణుమూర్తి" అని చెప్పకొనియున్నాడు — పిడుపర్తి సోమనాథుడు "పాల్కురికి సోమారాధ్యులం గొల్చెదన్" అని ఆరాధ్య శబ్దమునే వాడియున్నాడు —

### (i) కొత్త విషయములు

ఈ యక్షగానము వలన రెండు కొత్తవిషయములు తెలియుచున్నవి.

చక్రపాణి రంగనాథు డేకామ్ర
నాథు నామము ధరించుట—

వ్యాసమున నిట్లు గలదు :

"అనంతరము రంగనాథుడు
పాహిమాందయా నిధే
పాహిమాం మహేశ్వరేశ
త్రాహి త్రాహి సోమనాథ
త్రాహి త్రాహి సుగుణ యూథ."

ఇత్యాదిగా సోమనాథుని స్తుతింప సోమనాథుడాతనికి నిజస్వరూప మొసంగెను. అతనికి ఏకామ్ర నామధరణము గావించెను —

......ఏకామ్ర గురుచిత్త
సరసిజ భృంగసోమనాథలింగ"

అను మకుటముగల అన్యవాద కోలాహలములోని ఏకామ్ర గురుడితడే యని గినివలన గుర్తింపవచ్చును. రంగనాథునకు ఏకామ్రనాథ పేర్పడుట ఈ యక్షగానమువలన మాత్రమే తెలియవచ్చుచున్నది. గినివలన A Descriptive Catalague of Telugu Manuscripts గ్రంథసంఖ్య నెం. 1471 (మొదటి) అన్యవాదకోలాహలమను పేరింపొందుచున్న దీనికి కర్త ఏకామ్రగురుడుగానో తచ్ఛిష్యుడుగానో గ్రహింపబడుచున్నారు అను వ్రాతవలన దీని కర్త రంగనాథుడుగాని అతని శిష్యుడుగాని యుండవచ్చును. (పుట 9)

రంగనాథుడు ఏకామ్రనాథుడని యీ గ్రంథమున దప్ప మఱి యెటను తెలియుటలేదిది క్రొత్తది. ఈ అన్యవాద కోలాహలము క్రీ. శ. 1949లో వావిళ్లవారు భూమికతో ముద్రించిరి. దాని పీఠికలో ఇది ఏకామ్రనాథునిదిగానే స్పష్టముగా చెప్పబడినది. (పుట 4)

ఇది గీ......ఏకామ్ర గురుచిత్త
సరసిజ భృంగసోమనాథలింగ"

అను మకుటముగల శతకము—108 సీసపద్యము లున్నవి.

ఏకామ్ర గురువుయొక్క హృదయమనెడు పద్మమునకు భృంగమువంటివాడా— సోమనాథలింగా అని అర్థము. ఈ శతకము పాల్కురికి సోమనాథుని రచితము. దీనినిబట్టి ఏకామ్రనాథుడే దీనికి కర్త.

# మానస సరోవరంలో...

శ్రీ వి. లక్ష్మీపతిరావు

ఇక్కడ ఈ పర్వత పంక్తుల
అపరిచిత ఏకాంత స్థలాలలో
పరంపరలుగా అనుభవిస్తున్న దీనావస్థలలో
అనాసక్తంగా మనో విహంగాన్ని
అంతరిక్షంలోకి విసిరేసి
ఆలోచనల సుడిగుండాలలో కూరుకుపోయి
అహరహం నిరీక్షిస్తున్నాను నీకోసం !

మనోఫలకంపై చిత్రిస్తున్న
నైక జీవన చిత్రాలలో
సాక్షాత్కరించే ఆత్మీయుడవు నీవే;
నిన్ను ఏదేదో ప్రశ్నించడానికి
నాదా సమయా సమయాలతో పనిలేదు...
ఎందుకనో నీ సమాధానమే వినిపించదు
మౌనం నిరాకరణకు సూచనా ?
గగనం నిరాదృతికి ప్రతిబింబమా ?

ఐనా నేననుకుంటూనే ఉంటాను
పాలకడలి తేటతేట నురుగు కెరటాల
తూగుటుయ్యాలలో ఊగుతూ
ఎప్పుడో ప్రేమ వర్షాలు కురిపించి
సురభిళాల పైరగాలుల్ని విరజిమ్మి
జడప్రకృతి చెక్కిళ్ళకు నగిషీలు చెక్కి
పుడమి పొదలపై ముఖమల్ పరదాలు పరచి
ఈ సృష్టినంతా ఒక్క లిప్తలో హేలగా చిత్రించావు !

ఉత్తుంగ విహాయసాన్ని చుంబించే
శూన్యతలాల సూదికొండల మీద
వెండి జలతారు ఉత్తరీయా అలంకరించి
నిశిసిరి నీటి పయ్యెదల పల్లవాటుల విసిరి
ఉదారంగ బహారాలను ఊదుతూ
నీచుట్టూ నిన్ను నీవే త్రిప్పుకుంటూ
ఈ సమస్త సౌందర్యాన్ని ఒక్క లిప్తలో
లీలగా సృష్టించావు, అవునా ?

బాగుంది కాని, నేననుకుంటాను :
ఈ విశ్వాన్ని నీవేదో స్వార్థంతోనే
నిర్మించుకొని వుంటావని...?
ఈ దుర్భర ఆలోచనల సుడిగుండాలలో
గింగిరాలు తిరుగుతూన్నప్పుడు
తలపుకు వచ్చేది నీవు...
తలపులు తెచ్చేది నీవే... !

నువ్వీ రంగుల బుంగలో ఉంచిన
ఆయుష్కాంత శక్తిని
నా చిన్ని అగ్గిపెట్టెలోనికి నింపి
దొంగిలించుకు పోదామనుకొన్నాను
చించిన కాగితం పేలికలు
గాలిలోనికి ఎగిరిపోయే మాదిరిగా
చరాచర ప్రాణికోటి చూస్తూ
చరచర దిగంతాల దాపల
విశ్వాంతరాళాల లోనికి
దూది పింజల్లా ఎగిరిపోతే
నా అగ్గిపెట్టె తెరచి భూమికి
ఆయుష్కాంతపు ఇంజెక్షన్లు
చేదామనుకొన్నాను !...

చంద్రుడు మత్తుగా సోలే ప్రకృతిలో
వెన్నెల భాషలో గుసగుసలాడుతూన్నపుడు
ఈ మట్టిబంతిమీద
మాతృసృష్టి చేదామనుకొన్నాను
ఇంద్రచాపతూలికతో రంగురంగులు వేదామనుకొన్నాను

నాకిద్దనున్న అయస్కాంత మణిమంజూషతో
భూమికి వచ్చే అష్టగాయాల్ని మాన్పి
మాతృజన వత్సాల్యలందింపుదామనుకొన్నాను.
ప్రతి తారకీ పాపం
ఒక్కొక్క చంద్రుణ్ణిచ్చి
కళ్యాణం చేదామనుకొన్నాను!
కాని నాలోని కర్కశత్వం
ఒక్కొక్కప్పుడు నీ రమణీయ సృష్టిని
బలిగొంటున్నప్పుడు
నీ విర్మిత చేతనా చేతన ప్రకృతికి
మూలాధారమేదో తెలియక విస్తుపోతాను!
ఏ గుండెలు పిండి
ఏ విశిధ నీరవ గహ్వరాలు తెరచి
ఏ అనంత నిమ్నోన్నతాలు పరికించి
నీ జ్ఞాన సుధాద్యుతిని
నాపై ప్రసరించుకోగలనో చెప్పు!

చెప్పు చెప్పు...నీ దేనునిత్యం
వెన్నెల కిరణాలు పిండి
పుడమిని స్వైరిణిగా జేసే
కిటుకు లేమిటో చెప్పు!
ఆ తాంత్రిక శక్తిని నాకో కొంచెం
ప్రసాదించ రావూ?...

ఈ విశ్వమహా కావ్యంలో
నీవు నాయకుడవు; నేను ఉపనాయకుణ్ణేనా?
నీవు అమృత రసానివి, నేనో అంగారపాన్ని...
అహరహాజీవనయాత్రా పరిరంభంలో
నీతో నేనూ—నాతో నీవూ
పరిభ్రమించక తప్పదా?
చెప్పప్పామీ—చెప్పు చెప్పు!

[నేపాల్‌లో హిమాలయ పాదపీఠ ప్రాంతంలో విహరిగా వర్ష టిస్తున్న వేళల్లో...]

# ద్రవ్యోల్బణము - నిరుద్యోగము

శ్రీ వి. శ్రీరామచంద్ర

**1958** ప్రాంతంలో యింగ్లండులో ఫిలిప్సు అనే అర్థశాస్త్రవేత్త ద్రవ్యోల్బణమూ, నిరుద్యోగ పరిమాణమూ విలోమ సంబంధం కలిగివుంటాయని ప్రతిపాదించాడు. ధరల పెరుగుదల రేటూ నిరుద్యోగపు పెరుగుదలరేటు ఒకదానికొకటి విరుద్ధంగా ప్రవర్తిస్తాయని ఆయన మతం. మొదట యింజనీరుగావుండి అర్థిక శాస్త్రజ్ఞుడిగామారిన ఫిలిప్సుయొక్క యీ సిద్ధాంతానికి ఆధారం అంతకుపూర్వం యింగ్లండులోవున్న పరిస్థితే. క్రమేపీ ఆయన సిద్ధాంతం అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ వ్యవస్థకల దేశాలలో బాగా ప్రాచుర్యం పొందింది. ఆధునిక యుగంలో స్త్రీ పురుష జాతుల సంఘర్షణకు (Battle of Sexes) యీ ఫిలిప్సురేఖ ఒక సూచిక అని శ్రీ హారీ జాన్సన్ ఒకచోట చమత్కరించాడు. పురుషులకు ఉద్యోగాలు కావాలి. నిరుద్యోగ సమస్య పెరిగినకొద్దీ వారిలో అసంతృప్తి జనిస్తుంది. గృహిణులు ధరలు పెరిగినకొద్దీ దిగజారే కుటుంబ జీవన ప్రమాణాలు నిలుపలేక అవస్థపడుతుంటారు. సరి ఫిలిప్సు కనుక్కొన్న సూత్రం ప్రకారం ధరలు పెరుగుతుంటేనేగాని నిరుద్యోగం తగ్గదు. అందుకే హారీ జాన్సన్ అలా అన్నారు.

అసలు యీ సిద్ధాంతంలో కీలకమైనది కామికుల వేతనపు రేటు. ఏవస్తువుకైనా ధర తగ్గితేనేగానీ గిరాకి పెరగదన్న సాధారణ విపణిసూత్రం శ్రామిక విపణి (labour market) కి కూడా అన్వయిస్తే, వేతనపురేటు తగ్గితేగానీ ఉద్యోగావకాశాలు విస్తరించవు అని తేలుతుంది. శ్రామికవర్గం వేతనపురేటులో తరుగుదలకు ఒప్పుకోరు గనుకనే వారిలో కొంతమంది నిరుద్యోగులుగా వుండిపోతున్నారు అని ప్రాచీన ఉద్యోగ సిద్ధాంతం (classical theory of employment) చెబుతున్నది. విపణిలో [illegible] అవుతున్న వేతనపుస్థాయిని అంగీకరించిన ప్రతిశ్రామికునికి ఉద్యోగం దొరుకుతుంది; కాబట్టి విపణిలో ఎప్పుడూ 'సంపూర్ణ ఉద్యోగస్థితి' నెలకొని వుంటుంది; నిరుద్యోగం అంటూ వున్నదంటే అది కేవలం స్వచ్ఛందమైనదే — ఇది ప్రాచీన అర్థశాస్త్రవేత్తల మతం. లార్డ్ కేన్సు సిద్ధాంతం ప్రకారం నిరుద్యోగ సమస్యకు శ్రామికులు కారణంకాదు. పెట్టుబడులస్థాయి తగిన పరిమాణంలో లేక ఉద్యోగావకాశాలు విస్తరిల్లకపోవడమే యిందుకు కారణమని ఆయన మతం. డబ్బురూపంలో వేతనపు రేటులో తగ్గింపును శ్రామికులు ప్రతిఘటించినప్పటికీ, యథార్థ వేతనం తగ్గించి, పెట్టుబడులను వృద్ధిచేసి ఉద్యోగావకాశాలు పెంచవచ్చు నని ఆయన అభిప్రాయం. విపణిలో అమలులోవున్న వేతనం పుచ్చుకుని ఉద్యోగం చేయడానికి తయారవ్వేవారిలో చాలామంది నిరుద్యోగులుగానేవుండిపోతున్నారు. ఇందుకు కారణం శ్రమకు గిరాకీ లేకపోవడమే.

వికసితమైన ఆర్థిక వ్యవస్థలో ఉద్యోగావకాశాలు విస్తరించాలంటే మొత్తంమీద వేతనపు స్థాయి తగ్గక తప్పదు అన్నది పై రెండు సిద్ధాంతాలసారం. ధన వేతనపుస్థాయి పడిపోకుండా యథార్థ వేతనపు స్థాయిని తగ్గించాలంటే ద్రవ్యోల్బణం ఒక్కటే మార్గం. ఈ రకమైన కేన్సు వాదాన్ని బలపరుస్తుంది ఫిలిప్సురేఖ.

మనదేశంలోకూడా ఫిలిప్సుసూత్రం అన్వయించవచ్చని కొంతకాల క్రిందటివరకూ అర్థిక శాస్త్రవేత్తలు పలువురు విశ్వసించారు. 1966-67 లో వచ్చిన స్వల్పమాత్రపు ఆర్థిక మాంద్యకాలంలో తీవ్రమైన ధరల పెరుగుదలలోపాటు నిరుద్యోగ సమస్యకూడా పెచ్చరిల్లడం, పెట్టుబడి వస్తువులకు గిరాకి పడిపోవడంతో పాశ్చాత్య ఆర్థిక సిద్ధాంతాలపట్ల మన శాస్త్రజ్ఞుల నమ్మకం సడలిపోవడం జరిగింది. మరి ద్రవ్యోల్బణానికీ నిరుద్యోగ సమస్యకూ మనదేశంలో ఎలాంటి సంబంధం వున్నది అన్న విషయం యీ వ్యాసంలో ప్రస్తుతం.

ప్రణాళికా విధానం అసలు జరపడం మొదలు పెట్టి యిన్ని సంవత్సరాలయినా దేశంలో నిరుద్యోగాన్ని గురించి సరైన అంకెలు లేవు. దాంతేకమిటీ, భగవతి కమిటీ, ఎన్. ఎస్. ఎస్. వారి సర్వేల రిపోర్టులు యిందుకు కొంత ఉపకరించినప్పటికీ అవి సమగ్రంగా లేవు. వాటిమీద నిపుణులు వెలిబుచ్చిన అభిప్రాయాలుకూడా యింకా చేయవలసిన పని చాలావున్నదని సూచిస్తున్నాయి. అందుచేత యీ వ్యాసంలో ప్రభుత్వం ప్రకటించే 'ఆర్గనైజుడ్' రంగంలోని ఉద్యోగ గణాంక వివరాలను మాత్రమే గమనించడం జరుగుతుంది. స్వయం ఉపాధిక్షేత్రాన్ని (అంటే వ్యవసాయం తదితర వృత్తులు) పరిశీలించడంలేదు.

ధరల పెరుగుదలను కొలిచేందుకు పలురకాల సూచికలున్నాయి. టోకుధరల సూచిక, వివిధవర్గాల జీవన వ్యయసూచికలు, జాతి

యాదాయపు కొలతలో అంతర్భూతమైన "deflator" మొదలైనవి ముఖ్యమైనవి. దేశవ్యాప్తంగా వివిధ ఋతువులలో అన్నివస్తువుల ధరల మార్పులను మొత్తంమీద సూక్ష్మంగా ప్రతిస్పందిస్తూ సూచించేది అఖిలభారత టోకు ధరల సూచిక. ఈ వ్యాసంలో ద్రవ్యోల్బణాన్ని యీ సూచికతో కొలుస్తాం.

| సంవత్సరం | ఉద్యోగంలో ఉన్నవారిసంఖ్య (లక్షలలో) | | | అన్నివస్తువుల టోకు ధరల సూచిక 1961–62: 100 |
|---|---|---|---|---|
| | పబ్లిక్‌రంగం | ప్రైవేటు రంగం | మొత్తం | |
| 1965-66 | 93.79 | 68.1 | 161.89 | 131.6 |
| 1966-67 | 96.34 | 66.8 | 163.14 | 149.9 |
| 1967-68 | 98.02 | 65.3 | 163.32 | 167.3 |
| 1968-69 | 100.95 | 65.3 | 166.25 | 165.4 |
| 1969-70 | 103.74 | 67.0 | 170.74 | 171.6 |
| 1970 71 | 107.31 | 67.6 | 174.91 | 181.1 |
| 1971-72 | 113.05 | 67.7 | 180.75 | 188.4 |
| 1972-73 | 119.75 | 68 5 | 188 25 | 207.1 |
| 1973-74 | 124.86 | 67.9 | 192.76 | 254.2 |
| 1974-75 | 128.38 | 68.0 | 196.38 | 313.0 |

Source: Economic Survev, 1975—76, Govt, of India.

పై పట్టికలో ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి వున్నది. ఒక దశాబ్ద కాలపరిమితిలో జరిగిన విషయాన్ని అంకెలలో గణాంకాలు సూచిస్తున్నవి గనుక ఉద్యోగంలో వున్నవారి సంఖ్య, టోకుధరల సూచిక రెండూ పెరుగుతుండటం జరుగుతున్నది. అంత మాత్రంచేత ఉద్యోగావకాశాలూ, ధరల పెరుగుదల పరస్పరం ప్రత్యక్ష సంబంధం కలిగి వుంటాయనుకోవడం పొరపాటు, అవి కాలంలోని "ట్రెండు" వలననే,

ఫిలిప్సు ప్రతిపాదించినది నిరుద్యోగానికీ ధరల పెరుగుదలకూ మధ్య సంబంధాన్ని గురించి. ప్రతి సంవత్సరమూ దేశంలో పెరుగుతున్న జనాభాతో పోల్చిచూస్తే పెరుగుతున్న ఉద్యోగావకాశాలు చాలా తక్కువ. కాబట్టి ఉద్యోగాలలో చేరేవారికంటె నిరుద్యోగుల సంఖ్యలో పెరుగుదల హెచ్చు అన్నమాట. అంటే ద్రవ్యోల్బణంతోబాటు నిరుద్యోగ సమస్య పరిమాణం కూడా పెరుగుతున్నదన్నమాట.

ఈ దశాబ్ద కాలంలో పబ్లిక్‌రంగంలోని వివిధ క్షేత్రాలలో ఉద్యోగాలు 93.8 లక్షలనుంచి సుమారు 128.4 లక్షల వరకూ పెరిగాయి. కాని ప్రైవేటురంగంలో కొంచెం అటూ యిటూగా వది స్థితి గోరంతో పోలాగే వుండిపోయింది. కార్మికుల ఉత్పాదకశక్తి ధన వేతనపురేటు పెరుగుతున్నప్పటికీ, జీవనవ్యయంలో పెంపుదలవలన యథార్థవేతనపుస్థాయి పడిపోతున్న విషయం మనం అంగీకరించక తప్పదు. (1975 మధ్యభాగంనుంచి ధరల పెరుగుదల తిరుగుముఖం పట్టిన తర్వాత యదార్థవేతనం పెరుగనారంభించింది.)

పబ్లిక్‌రంగంలోని పెట్టుబడులు, ఉద్యోగావకాశాలూ విపణిలో సరఫరా, గిరాకీ సూత్రాల ఆధారంమీద ప్రవర్తిల్లవు. అవి ప్రభుత్వం వివిధ లక్ష్యాలను సాధించడానికి అనుసరించే విధానాలమీద, ప్రణాళికలలో నిర్ణీతమైన లక్ష్యాలమీద ఆధారపడి వుంటాయి. విపణిబద్ధమై నడుచుకునే ప్రైవేటురంగంలో మరి ఒకవైపు ధరలు పెరుగుతున్నా ఉద్యోగావకాశాలు పెరగడంలేదు. అందుచేత స్థూలంగా మనం ఫిలిప్సు సూత్రానికి వ్యతిరేకంగా వాదించడానికి చాలా ఆధారం వున్నది.

వెనుకబడిన దేశాలలో ఉద్యోగావకాశాలు ఆహార ధాన్యాలు ముడిసరుకుల ఉత్పత్తిమీద ఆధారపడి వుంటాయి. అలాగే మనం అనుసరించే ఉత్పత్తి విధానంలో యాంత్రికశ్రమ మానవీయశ్రమ ఏ నిష్పత్తిలో కలిసి వుంటాయి అన్న విషయంమీద కూడా ఆధారపడి వుంటాయి. 1951 నుంచి నేటివరకూ మన పెట్టుబడి ఉత్ప

త్తుల నిష్పత్తి 2.3 నుంచి సుమారు 3.5 వరకూ పెరిగింది. అంటే ఒక యూనిట్ జాతీయాదాయం ఉత్పత్తి చేయడానికి కావలసిన కాపిటల్ 2.3 నుంచి 3.5 యూనిట్లవరకూ పెరిగింది. ఈ సంఖ్య పెరుగుతున్నకొద్దీ ఒక్కొక్క ఉద్యోగావకాశం సృష్టించడానికి కావలసిన పెట్టుబడి కూడా పెరిగిపోతూ వుంటుంది, స్వాతంత్ర్యం సంక్రమించినప్పుడున్న నిరుద్యోగ సమస్యనే పరిష్కరించుకోలేకపోగా అదనపు జనాభాతో యీ సమస్య పెరిగిపోతున్నది. లక్ష్యరహితమైన విద్యావ్యాప్తి, నగరాలు పట్టణాలకు ప్రజల వలస మూలంగా దీనిస్వరూప స్వభావాలే మారిపోతున్నాయి.

ఈ క్రిందివిధంగా మనం ఒక స్థూలమైన అంచనా వేసుకోవచ్చు. వ్యవసాయం తదితర అనుబంధిత శాఖలలో మొత్తం జనాభాలో దాదాపు డెబ్బదిశాతం ప్రజలు కార్యనిమగ్నులైనట్లు మన "వృత్తి నిర్మాణ" విశ్లేషణలవలన తెలుస్తుంది. పై పట్టీననుబట్టి 'అర్గనయిజ్డు' రంగంలో 196 లక్షలమంది ఉద్యోగంలో వున్నారు. సుమారు రెండుకోట్లు అనుకుందాం. ఒక్కొక్క ఉద్యోగస్థునిమీద ఆధారపడిన వారిసంఖ్య సగటున 2 నుంచి 5 అనుకోవచ్చును. నగరాలలో అయితే కుటుంబంలో చాలామంది ఏదో వృత్తిలో వుంటారు. పట్టణాలలో కుటుంబానికొకళ్ళుండవచ్చు. అంటే ఆర్గనైజ్డ్ రంగంలోని ఉద్యోగాలవలన 4 నుంచి 10 కోట్లవరకూ జీవనాధారం లభిస్తున్నదన్నమాట. 1971 జనగణాంక వివరాల ప్రకారం 56కోట్లున్న జనాభా నేడు తేలికగా 60కోట్లుంటుంది. వ్యవసాయాది వృత్తులలోవున్న 70 శాతంతోబాటు పల్లెపట్టులలో చిన్న చిన్న వ్యాపారాలలో వున్నవారిని వగైరా కలుపుకుని 75 శాతం తీసివేస్తే మిగిలేది 15 కోట్లమంది. అందులో 4 నుంచి 10 కోట్లవరకూ ప్రత్యక్షంగా జీవనాధారం లభిస్తున్నది. మిగిలినవారి సంగతేమిటి?

వ్యవసాయరంగంలో గణాంకాలు పరిశీలిస్తే భూమిహీనులైన కార్మికులసంఖ్య పెరుగుతున్నట్లు స్పష్టంగా తెలుస్తుంది. దీనికి కారణం భూమి యాజమాన్యంయొక్క కేంద్రీకరణ కావచ్చు. భూకామందులు పట్టణ ప్రాంతాలలో యితర వృత్తులలో తమ పేరు నమోదు చేయించుకొని వుండవచ్చును. ఏమైనప్పటికీ భూమిహీన కార్మికులకు ఉపాధి లభించేది సంవత్సరంలో కొన్ని ఋతువులలో మాత్రమే. అధిక దిగుబడి విత్తనాలవలన, ఎరువులు, పెరుగుతున్న నీటిపారుదల సౌకర్యాలవలన కార్మికులకు సంవత్సరంలో ఉపాధి లభించే రోజులసంఖ్య కొద్దో గొప్పో పెరిగింది. అలాగే పల్లెపట్టులలో వేతనాల స్థాయికూడా పెరిగింది. కాని నానాటికీ పెరిగిపోతున్న జనాభా దృష్ట్యా, ప్రజల జీవనావసరాల దృష్ట్యా వ్యవసాయరంగంలో కార్మికుల స్థితి మెరుగుపర్చడానికి, ఉద్యోగావకాశాలు విస్తరింపచేయడానికి చేయవలసినది చాలా వున్నది. మరొక వైపు మరనాగళ్ళు వంటి యంత్రాలు ప్రవేశపెట్టడంద్వారా కొన్ని కొన్ని ప్రాంతాలలో కార్మికులు ఉన్న ఉపాధినే కోల్పోయే ప్రమాదం ఏర్పడింది.

ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజ్ కేంద్రాలలో రిజిస్టర్లలో పేర్లు నమోదు చేసుకున్నవారిసంఖ్య సెప్టెంబరు 1975 నాటికి 92.5 లక్షలు. 1974 నాటికంటె యీ సంఖ్య 7 శాతం హెచ్చు. 1973 నుంచి 1974 నాటికి పెరుగుదల 5.4 శాతం. వీరందరూ ఏదోరకంగా విద్యావంతులే.

ముఖ్యంగా సాంకేతికవిద్య అభ్యసించిన వారిలో చాలా భాగం నిరుద్యోగులుగా వుంటున్నారు. పరిశ్రమలలో ఎన్నో అప్రెంటిసు ఉద్యోగాలు ఖాళీగా వున్నప్పటికీ వాటిని భర్తీచేయడంలేదు.

ఈవిధంగా అటు పారిశ్రామికరంగంలోనూ, ఇటు వ్యవసాయక రంగంలోనూ; విద్యావంతులలోనూ, విద్యాహీనులలోనూ నిరుద్యోగం ప్రబలిపోతున్నది. ఉద్యోగావకాశాలు పెరగడానికి ధరల పెరుగుదల అవసరం అన్న విషయం ఎప్పుడో సత్యమైన (ఇంగ్లండులోనే శిష్యులేను యిప్పుడు ఖండిస్తున్నారు) సూత్రాని విడనాడి పాడు పశు పెంచి ఉత్పత్తి సాధనాలను సమకూర్చుకుని ఆహార ధాన్యాల విషయంలో స్వయంసమృద్ధి సాధించడం అవసరం. అలాగే మన ఉత్పత్తి విధానాలలో శ్రమకు ప్రాధాన్యమిచ్చేవిధానాలు అవలంబించడం అవసరం. లేకుంటే పెరిగిపోయే నిరుద్యోగ సమస్య సామాజిక విచ్ఛిత్తికి ప్రోత్సహించడం తప్పదు.



# పంచపాత్ర

## శ్రీ కె. ఎస్. వి. నరసింహం

నవల రాద్దామని కూచున్నాను.

తలుపు చప్పుడు.

"ఎవరూ ?"

జవాబులేదు.

ఆశ్చర్యపోయేను.

ఇంకా సరిగ్గా తెల్లవారలేదు. చలిచలిగావుంది. మంచు కురుస్తోంది. ఈవేళప్పుడు నాగది కొచ్చేదెవరు ?

మళ్ళీ తలుపు చప్పుడు.

"ఎవరది ? —" అన్నాను మళ్లీ. కలం మూసి పక్కన పెట్టేను. గుమ్మంవేపు చూసేను.

తలుపు వేసుంది గాని, గడియవేసిలేదు.

తలుపు తట్టిన వ్యక్తి తలుపునెట్టి లోపలికి రావొచ్చుగదా ?

"కమిన్ ప్లీజ్ !..." అన్నాను.

మరుసటి క్షణంలో తలుపు తెరుచుకుంది.

ఆరడుగుల భారీ మనిషి వొకాయన లోపలికి జొరబడ్డాడు.

"ఆనందరావు మీరేకదూ ?—"

అవునన్నాను.

"రచయిత ఆనందరావు—"

ఏం చెప్పాలో తోచలేదు. సరే—ఆమాటని దాటేస్తూ—

"మిమ్మల్ని నేనిదివరకెక్కడా—" అని అర్ధోక్తిలో ఆగేను.

"చూశ్శేదులెండి—" అన్నాడాయన. నాటకీయంగా మూడడుగులు ముందుకొచ్చి — వొకడుగు వెనక్కి వేశాడు — "నేను — మీ పాత్రని—" అని నవ్వేడు.

ఆలోచనలో పడ్డాను.

"ఆశ్చర్యపోతున్నారా ?—" అన్నాడాయన.

లేదని ఆయనకి తెలుసని నాకు తెలిసింది.

మేజామీది కాయితాలకేసీ కలంకేసీ సాభిప్రాయంగా చూపేడు.

"కొత్త నవలా ?—" అన్నాడు.

"నవల—అంటే కొత్తదనే అర్థం—" అన్నాను గడుసుగా.

"దానికేముందిలే — నవల అంటే — ఆడది అనికూడా అర్థం వుంది" అన్నాడాయన.

నా పాత్ర అని చెప్పుకునే ఆయనముందు వోడిపోవడం నా కిష్టంలేదు. "నిలబడే వుండిపోయేరు—కూచోవొచ్చునే—" అన్నాను కుర్చీ చూపిస్తూ.

"నేను కూచోవడానికి రాలేదు" (సినిమా డైలాగు)

"నించోవడానిక్కూడా రాలేదు కదా ?—"

"నవల రాస్తున్నారుకదా ! — నామీద రాస్తారేమోనని వచ్చేను —"

"నేను నవల రాస్తున్నట్టు మీకెలా తెలిసింది ?—"

"మర్చిపోకండి — నేను మీ పాత్రని—"

ఆయనకి నడివయస్సెప్పుడో దాటింది. చెవులదగ్గిర వెంట్రుకలు తెల్లబడుతున్నాయి. కనుబొమలుకూడా పల్చబడుతున్నాయి. ముదురు నీలంరంగు సూటులో చాలా హుందాగా వున్నాడాయన. ఖరీదైన తండ్రి పాత్రకి సరిపోయేలా వున్నాడు.

"మీరు నన్ను మీరనకండి—బావులేదు—"అన్నాను సవినయంగా.

ఆయన సంతోషించినట్టు కనిపించేడు, నవ్వేడు.

"కూచోమంటే కూచోలేదు మీరు — మీ పేరేమిటోకూడా చెప్పలేదు—" అన్నాను.

"అబ్బాయ్ ! —" అన్నాడాయన. ఆగి నవ్వేడు, సాభిప్రాయంగా.

"అలాగే పిలవండి" అన్నాన్నేను — వినయాన్ని కొనసాగిస్తూ.

"—నేను నీ పాత్రని—" అన్నాడాయన మళ్ళీ—"నా పేరేమిటో నువ్వే చెప్పాలి—" అన్నాడు.

"నీలకంఠంగారు" అన్నాను.

"కాదు—"

"రంగారావుగారు—"

"ఉహు—"

"నాగభూషణరావు—"

"నో నో—"

"సరే ఆఖరిపేరు-ఇది తప్పడానికి వీల్లేదు. రఘునాథ రాయణింగారు—"

గట్టిగాని నవ్వేడాయన.

"రైటేనా?—" అన్నాను.

"రైటే రైటేనే నవ్వుతావేం? ఇదుగో ఆనందరావ్!... నువ్వేం రచయితవయ్యా?..." అన్నాడాయన.

తూరుపు తెల్లవారిపోతోంది. పిల్లగాలులు కిటికీలోంచి చల్లగా వీస్తున్నాయి. బోగన్ విలియాలు తమాషాగా నవ్వుతున్నాయి.

మౌనంగా సిగిరెట్టు తీసి వెలిగించి పొగవదిలి ఆగంతకుళ్ళా ప్రవేశించిన నా పాత్రవేపు చూసేను.

"సిగిరెట్టు తాగేవాళ్ళంటే నాకు పడదు—" అంటూ కోటు జేబులోంచి పైపుతీసి అతిప్రయత్నంమీద వెలిగించి. గుప్పు గుప్పుమని పొగ వదిలేడు. 'ఇదుగో ఆనందరావ్!...కోపం వచ్చిందా?—"

"అబ్బే!— నాకు కోపమెప్పుడూ రాదండీ—"

"గుడ్! కాని-కోపం ఎందుకురాదు?"

"నా పాత్రలమీద కోపం తెచ్చుకోవడానికి నేనెంతటివాణ్నండి? ఆఫ్టరాల్ వాళ్ళ రచయితగాణ్ని-అంతేగా?—"

"అదేమిటలా అంటావ్? నీ పాత్రలంటే ఏమిటి? నీ సృష్టేగా?—"

"ఏం లాభం? రచయితగా పేరు నాది, అంతే! కాని, కథో? కథంతా పాత్రలదేగా? కథలో మాట్లాడేది పాత్రలే! నడిచేదీ పాత్రలే! నవ్వడం, యేడవడం, ప్రేమించడం, త్యాగాలు చెయ్యడం, కన్నీళ్ళు కార్చడం—అంతా పాత్రలవంతే! నాదేముంది? కేవలం నిమిత్త మాత్రుణ్ని—"

"నమ్మమంటావ్?—"

"నమ్మి చెడినవారులేరు. ఉదాహరణకి మిమ్మల్నే తీసుకోండి— నేనేదో పొద్దున్నేలేచి స్నానం గీనం చేసి బుద్ధిగా నవల రాసుకుందామని కాగితాలు ముందేసుక్కూచున్నానో లేదో—వొచ్చి తలుపు తట్టేరు మీరు సరే. ఎవరు మీరంటే నా పాత్రన్నారు. ఇహ నేను రాసేదేముంది? కథ నడపాల్సింది మీరే!—"

"కథ నడపడానికి రాలేదు నేను-కథ చెప్పడానికొచ్చేను—"

"ఆ రెండింటికీ అట్టే తేడాలేదు లెండి. కథ చెప్పడాన్నే కథ నడపడం అని కూడా అంటారు—"

"ఫరవాలేదు నువ్వు మరీ అంత మందమతివికావు—" అన్నట్టు చూసేడాయన.

"పెద్ద కథా-నవలా మీది?—" అన్నాను.

"నా పేరు ధనపతి—" అన్నాడాయన నా ఎదురుగా కుర్చీలో కూచుంటూ.

"నా ప్రశ్న—" అన్నాను.

"సరే నాది పెద్ద కథాకాదు, నవలాకాదు, చిన్నకథ కూడా కాదేమో" అన్నాడాయన, ధనపతి.

శూన్యంగా చూసేను.

"అయినా నేనో పాత్రని—" అన్నాడు మళ్ళీ.

"కథలోకి గాని పెద్ద కథలోకిగాని నవలలోకి గాని-దేంట్లోకీ రాకుండా పాత్రలెలా వుంటాయి?—" అన్నానేను.

"కథల్లోకీ నవలల్లోకీ రాకుండా జీవితంలో చాలా పాత్రలుంటాయి. పాత్రలంటే పుట్టి పాత్రలు—అంతే-!"

"బాబోయ్! మీరు జీవితంలో పాత్రా? మిమ్మల్నెక్కడా చూడలేదని మొదట అన్నానుగాని-ఎక్కడో చూసినట్టు ఇప్పుడు అనుమానం వొస్తోంది—"

"బస్‌కమ్—" అన్నాడాయన గర్వంగా. చెప్పొద్దూ? ఆయన ముదురు నీలిరంగు సూటు నచ్చిందిగాని, ఆ నాటు దొరాస ఇంగ్లీషు మాత్రం నాకు నసేమీ నచ్చలేదు. "నేను జీవితంలో పాత్రనీ కాను. కథల్లో నవలల్లో పాత్రనీ కాను. నువ్వు నన్ను ఇంతకు ముందెప్పుడూ — కలలో కూడా—చూసి వుండవు—" అన్నాడాయన, ధనపతి. ఏమిటో—ఆయనపేరు వింతగా వుంది. "నేను నీ పాత్రని—పుట్టే పాత్రని! ప్రస్తుతానికంతే! కాని, నువ్వేదో నవల రాయాలనుకుంటున్నావుగదూ?—కావలిస్తే నాగురించి రాయొచ్చు. రాస్తావేమో కుదుర్తుందాననే—ఇంత ప్రొద్దున్నే బైల్దేరొచ్చేను—"

"తెలుసుగా- పూర్తిగా తెల్లారింతర్వాతొచ్చినా- నేనేం పారి పోనుగా-"

"నువ్వు పారిపోవు. కాని, నా బుద్ధి మారిపోవొచ్చు—"

గంటకోసారి మారే బుద్ధి అదేంబుద్ధి — అందామనుకున్నాను. ఏందుకులే పెద్దవాడని అనడం మానుకున్నాను.

"సరే—ఇంతకీ యేమంటావు?-" అన్నాడు ధనపతి.

"ఏమిటి ఏమనడం?—" అన్నాను—బ్లాటింగ్ పేపర్ వెనక వేపు "ధనపతి - ధనపతి" అని రాస్తూ.

"అదే—నామీద నవల-"

"చెప్పండి మరి—"

"ఏం చెప్పను?—"

"ఏమైనా చెప్పండి-"

"ఏం చెప్పినా రాస్తావా?—"

"ఏం చెప్పినా వింటాను—"

"మరి రాయడం?—"

"రాస్తే రాస్తాను—"

"రాయక పోతే?—"

"రాయను—"

ధనపతి పైపు ఆరిపోయింది విశ్వప్రయత్నంమీద మళ్ళీ వెలి గించుకున్నాడు. ఆలోచిస్తున్నాడు. చెప్పనా- వద్దా—అని కాబోలు. లేదా, ఏం చెప్పను?—అని కాబోలు. చివరికి తేరుకున్నాడు. గుప్పు గుప్పున పొగవదిలేడు. "చెప్పడానికేంలేదు. ఏదేది నోటికొస్తే అదల్లా చెప్పేస్తాను- బోరుకొట్టినాసరే— నువ్వు విని తీరాలి—" అన్నాడు ధనపతి.

"మీ గురించి మీరు చెప్తే వినాలనుంది. చెప్పండి, వింటాను. ఎందుకోగాని నా కిష్టమైనవి వింటే అనుకోకుండా నిద్రొస్తుంది. మధ్యలో నిద్రపోతే లేవగొట్టే పూచీ మీదే-" అన్నాను.

"అలాగేలే ! నువ్వు నిద్రపో చూద్దాం-లేవగొడతానో-కొడతానో నీకే తెలుస్తుంది —" అన్నాడాయన, ధనపతి, ఇన్‌స్పిరేషన్ కోసం పైపు చప్పుడయేలా పీలుస్తూ.

నేను కొత్త సిగిరెట్టు వెలిగించి "మరింక చెప్పండి"అన్నట్టు చూస్తున్నాను.

ధనపతిగారిలా చెప్పేడు :

ముందే చెప్పేనుగా — ప్రత్యేకంగా చెప్పడానికంటూ నా జీవితంలో ఏం లేవు. నాజీవితం జీవితమే. చిన్నకథాకాదు, పెద్దకథా కాదు, నవలాకాదు, నాటకమూకాదు. నా జీవితంలో నవరసాలు లేవు. వున్న దొక్కటేరసం, నీరసం. రసవంతంగా రాయాలని ఎవరైనా అనుకుంటారు, నీరసవంతంగా రాయాలని ఎవరైనా అను కుంటారా ? ఎవరి సంగతో ఎందుకు ?—పోనీ—నువ్వనుకుంటావా?—

అదుగో- నీ ముఖంలో అప్పుడే చికాకు బయలుదేరుతోంది — ఉపోద్ఘాతం మొదలెట్టేనని కదూ ? ఉపోద్ఘాతాలంటే పాఠకుల కెలాగూ ఇష్టం వుండదు ! రచయితలక్కూడా అట్టే ఇష్టమేం వుండదని ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. సరే — ఆగాగు — నాగురించే చెప్తాను.

అవును, నాపేరు ధనపతి. అంటే నీకు తెలుసు, నిజంగా కూడా నేను ధనపతినే! మీవూరికీ మావూరికీ అరవైమైళ్ళపైనే వుంది దూరం, వూరిపేరు నేను చెప్పను. గెస్‌చేసి నువ్వు తెలుసు కున్నా — హౌద్నా — నాకు చెప్పకు. మా వూళ్ళో నాదో పెద్ద ఫ్యాక్టరీ వుంది. ఏం ఫ్యాక్టరీ అని అడక్కు—ఫ్యాక్టరీ—అంతే !

విదేశీ బ్యాంకుల్లో కూడా ఖాతాలున్నాయినాకు. ఇహ స్వదేశీ బ్యాంకుల సంగతి చెప్పనవసరం లేదుకదూ ?

బోలెడన్ని కార్లున్నాయి. బంగళాలున్నాయి. హుండీ మార్బలం వుంది. సంఘంలో గౌరవ మర్యాదలున్నాయి. అసెంబ్లీలో పలుకుబడి చాలావుంది.

పేరేకాదు నేను అక్షరాలా వాస్తవంగా ధనపతినే!

మనిషి భూమ్మీద సుఖపడడానికి కావలసిన హంగులన్నీ నాకు పుష్కలంగా వున్నాయి —

అయినా రాత్రింబవళ్ళు వారంలో ఏడుదినాలు, నెలలో ముప్పై (ముప్పై యొక్క) దినాలూ, సంవత్సరం పొడుగుతా — నేను క్షణం క్షణం కోరుకుంటూవుండే అమూల్య అపురూప వస్తువు వొకటుంది — వొకే వొకటి-అనంత ధనరాసులైనా నా కందివ్వలేని గుప్పెడంత వస్తువు — నిజానికి వస్తువూకాదు—ఏమిటనుకున్నావు — అది —

"చ్ప్ !"- అన్నాను, అప్రయత్నంగా.

ఆగిచూసేడు ధనపతి. "ఏమిటి ?—" అన్నాడు.

"మీ క్కావలసిన ఆ గుప్పెడు వస్తువు—వస్తువూకాదు ఏదా

కాదు అది—మనశ్శాంతేనా ?—" అన్నా న్నేను, మినిస్టేటర్ షెర్లాక్ హోమ్స్ లాగా.

"హుం—" అన్నాడు ధనపతి.

దానర్థం నాకు బోధపడలేదు.

""హుం—" అంటే ఏమిటండీ ?—" అన్నాను, ఎంతో కొంత అయోమయంగానే ?

"సరేలే—నేన్నిలాగా పత్రుత్తి(?)కాను —" అన్నాడు. "ఇంతకీ కథ వింటావా వినవా ? —" బెదిరించేడు.

"కథాకాదు నవలాకాదు—అని ఇందాకా దబాయించేరే ! ?—"

"అప్పుడు కాదు, ఇప్పుడు కాను, నా జీవితం, నాయిష్టం.",

"క్షమించండి, తెలీకేదో అన్నాను. మరింక చెప్పండి. మీకు కావలసింది గుప్పెడు మనశ్శాంతి—మనశ్శాంతి—అంతే కదూ ?—"

"అవును—మనశ్శాంతే!—" అన్నాడు ధనపతి.

అవును, మనశ్శాంతి కావాలి నాకు, మ—న—శ్శాం—తి !— ఇవిస్తారు నాకు మనశ్శాంతి? కార్లూ, బంగళాలూ, బిజినెస్, మీటింగులూ, పెద్దపెద్ద పార్టీలూ, ఖరీదైన కోట్లతో షేక్‌హేండ్సూ, బ్యాంక్‌ఖాతాల్లో నెలనెలా పెరిగే వాడ్డీలూ—ఇవన్నీ కలిసి నాకు ఏమిస్తాయి చెప్పూ ? — ఓహ్! సంఘంలో పలుకుబడి, వెళ్ళిన చోటల్లా ధనపతిగారికి జై ! వెళ్ళని చోటినుంచికూడా ధనపతిగారికి జైజై!

జీవితంలో సస్పెన్‌తో విసుగెత్తిపోయేననుకోదు ! ఈ సస్పెన్ అంతా కలిసినా నా కొక్కపూట మనశ్శాంతి అయినా ఇవ్వలేదే అని నాబాధ. సుఖాంతులు—అని ద్వంద్వ సమాసం వాడతారే—సుఖమైతే ఎలాగోలాగా సంపాదించుకోవొచ్చు—కాని, శాంతిని పొందడమెలాగ?—

"అలిసిపోయినట్టున్నారు — కాఫీ తీసుకోండి —" అన్నాను, ధనపతిగారిని మధ్యలో ఆపి.

(నా గదిలో నేను తప్ప ఇంకెవరూ ఉండరు. కాని, నాకేది కావాల్నా వెంటనే తయారై వొస్తుంది. ఎలా వొస్తుందో నాకు తెలుసు. ప్రయత్నిస్తే ఎవరికైనా తెలుస్తుంది. ఎవరికీ చెడపోవచ్చు(?), సరే, ధనపతిగారికోసం నేను కాఫీ తెప్పించేను.)

"బావులేదా నాకథ ?—" అన్నాడు ధనపతి, కాఫీసిప్‌చేస్తూ.

"కాఫీ ఎలావుంది ?—" అన్నాను.

"ఫైన్ !—" అన్నాడాయన.

"మీ కథమూ అంత బాగుగావుంది." చెంపోలేదు—" అన్నాను.

"చెంపా ? చెంపోకేం ? — కావలసినంత తెప్పిస్తాను. నీకు వూపిరాడదేమోనని నా భయం. కానుకోమరి—" అన్నాడు ధనపతి.

క్షణంలో ఆయన బంగిమ మారిపోయింది. తాగుతూన్న కాఫీ సగంలో ఆపి కప్పు టేబిల్‌మీద పెట్టి జేబులోంచి వొక చిన్న సీసా బైటికి తీసేడు. అందులోంచి రెండు మాత్రలు తీసి నోట్లో వేసుకుని గుటుక్కున మింగేసేడు. మిగిలిన అరకప్పుకాఫీకూడా చక్కగా వొక్క గుక్కలో ఫినిష్ చేసేసేడు కూచున్న కుర్చీలోనే వెనక్కివాలి తల వెనక్కి వాల్చేసి రిలేక్స్ అవుతేడు! ఆయన ముఖమ్మీద సుమ్మరంగా చెమటలు పోస్తుండడం చూసి గాభరాపడిపోయేను. తొందరగాలేచి ఫేన్ స్పీడ్ ఆన్‌చేసి రెగ్యులేటర్ ఫుల్‌లో పెట్టేను. ఆయన ఇంకా అవస్థపడుతూనే వుండడంచూసి ఏదో అవదే(?) అనుకుని — ముందు ఆయన నెక్‌టై వదులుచేసేను,

'అబ్బా!—" అన్నాడు ధనపతి.

'యేమైందండి ?..."

"హుం-"

"డాక్టరుగ్గాని ఫోన్ చెయ్యమంటారా?—"

"వూం హుం—"

"మీ వాలకం చూస్తుంటే నాకెందుకో భయంగా వుంది—"

దీనంగా చూసేడాయన నావేపు. ఎవరో పాత పరిచయస్తుణ్ణి చూసి నవ్వినట్టు నవ్వేడు. ఆ నవ్వు చాలా విచిత్రంగా వుంది.

"ఆనందరావ్!..."

"చెప్పండి ఎందుకలా అయిపోయేరు హఠాత్తుగా..."

"హూం—" నవ్వేడు. తేరుకున్నాడు. నవ్వి తేరుకోవడం అలవాటు కాబోలు. కుర్చీలో మామూలుగా కూచున్నాడు.

"ఆనందరావ్! నాకు గుండె జబ్బుందని నీకు తెలీదు—గుండె జబ్బు చాలా ఖరీదైన జబ్బు—మాలాంటివాళ్ళకే వస్తుందని. నాకి వొచ్చింది ..అబ్బా!......"

"మాత్రలు వేసుకున్నారూ..."

"వేసుకోవాలి...ఆ క్షణానికి ఆ మాత్రలు వేసుకోకపోతే... అంతే...నా ఫ్యాక్టరీ నా కార్లూ నా సంపద ఏవీ నన్ను రక్షించలేవు... ఇంత పెద్ద ధనపతి గుండెకాయని రక్షించే సాధనాలేవో తెలుసా?— ఇదుగో—ఇంత చిన్న మాత్రలు......"

పేలవంగా నవ్వేను. అంతకన్నా ఏం చెయ్యగలను?

"ఈ బతుకింతే అసుందరావ్!" అన్నాడు ధనపతి—"ఇది బాగుపడదు—పడనే పడదు—"

"డాక్టర్లు మీకు చెప్పే వుంటారు—మీరు బాగా రెస్ట్ తీసుకోవాలి అనవసరంగా ఎక్సయిట్ కాకూడదు—" అన్నాన్నేను, నేను ధోరణిలో జాలిని కూడా రంగరించి.

ధనవంతులకేం కష్టాలుంటాయ్.

ఎంతచెట్టుకు అంతగాలి!

"అనవసరంగా ఎక్సయిట్ అవుతున్నానని ఎందుకనుకోవాలి? అవసరంగానే ఎక్సయిట్ అవుతున్నానేమో!..."

"అదేవిటి?..."

"అవును—అసుందరావ్! అనుభవించడానికి అన్నీ వుండి కూడా ఎంత అశాంతిలో అలమటిస్తున్నాన్నేను!—"

"అంటే—మీ వ్యవహారాలు...అంటే—అంటే"

"చెప్పడానికి నాకులేని మొహమాటం అడగడానికి నీకెందుకూ? చెప్తాను—నువ్వు రాసినా రాయకపోయినా సరే నీకంతా చెప్తాను—"

ఎదురు చూడని మలుపు.

ధనపతి జీవితం వెనక ఏమి అగాధాలున్నాయో!?

శ్రద్ధగా వింటున్నాను.

కర్చీఫ్‌తో నుదుటిమీది చెమటలు ఒత్తుకుని తిరిగి కథనం పునఃప్రారంభించాడు ధనపతి —

—ఎవరికీ తెలీదు నా అశాంతికి కారణం. ఎవరికీ తెలీదు నా నిజస్వరూపం. పెద్దమనిషినే. కాదన్ను, కాని ప్రతి పెద్దమనిషి లోనూ ఏదో ఒక చిన్నబుద్ధి వుంటుందనిపిస్తుంటుంది నాకు, చెప్తున్నా చెప్తాను.

నా కుటుంబం గురించి ఏమీ చెప్పలేదు కదూ నీకు?... ఫేక్టరీ పెట్టేందుకు నాలుగేండ్ల క్రితం పెళ్ళిచేసుకున్నాన్నేను, ఇష్టంలేని పెళ్ళి. నాకూ ఇష్టంలేదు, ఆవిడకూ ఇష్టంలేదు. అయినా మా యిద్దరికీ పెళ్ళయింది. ఎలా అయిందని అడక్కు. ఎవరికీ ఇష్టంలేకున్నా ధర్మాన్ని పెళ్ళి జరిగిపోతున్నాయి. అలాగే ఇదీని. ఇష్టానిష్టాల సంగతి కూడా వదిలెయ్యి. ఇదొకటుంది, ఎలాగో—ఒకటి జరుగుతుంది, దానివల్ల మరోటి. దీనివల్ల తప్పని సరిగా వేరొకటి జరిగిపోతుంది. చివరికి చూస్తే జీవితం మొత్తం ఇలా కనిపిస్తుంది. పెళ్ళి సవలే ఎందుక్కావాలి? జీవితం ఒక ఫ్యాక్టరీ ఎందుక్కాకూడదూ? సరే—ఉపమానం ఏదైతేనేంలే!...

ఆ పెళ్ళివల్ల కాకపోతే నేను ఫ్యాక్టరీ పెట్టేవాణ్ణి కాదు, లాభాలు తీసేవాణ్ణి కాదు, లక్షలు గడించేవాణ్ణి కాదు. నాకు సంఘంలో ప్రతిష్ఠ ఇంతగా పెరిగేది కాదు. ఆ పెళ్ళి జరిగుండకపోతే ఇలా నా కొడుకయ్యేవాడు కాదు!... ...'

అవును, నీకూ నావాళ్ళు తెలుసోంది నాకు, ఒక్క కొడుకేనా అని అడుగుతావు కదూ? అవును. ఒక్క కొడుకే. ఒక్కడే కొడుకు. వాళ్ళమ్మంటే నాకు ఎప్పుడూ ఇష్టం లేదు. అఖిలాదేవి — ఆమె పేరు. హూఁ హూఁ — అబద్ధాలు చెప్పనులేను. అందం, గుణం, చదువు—సంస్కారం ధనం—ఆవిడకేవీ తక్కువకావు. కాని ఆవిడంటే నాకిష్టంలేదు. ఎందుకో ఎప్పుడూ అర్థంకాని ఇష్టం తెచ్చుకుందామన్నా వీలుపడలేదు. నాకావిడంటే ఇష్టంలేదు సరే — ఆవిడకి నేనంటే అభిమానం వుండొచ్చుగదా! — హూఁ హూఁ — అదీలేదు. ఇద్దరం ఇష్టరమే! సమాంతరాలు అనంతంలో కలుస్తాయని గణితంలో సిద్ధాంతం. నేనూ అఖిలామాత్రం అనంతంలో కూడా కలవం!......

కళా పుట్టేడు, వాడు అఖిలనూ నన్నూ కలపలేదు. కాని ఎప్పటికప్పుడు — మరీ దూరమైపోకుండా మాత్రం వుంచేడు. కళా పూర్తిపేరు చంద్రకళాధర్. వాడు నా కొడుకు. నా ప్రాణం. అఖిలకు విడాకులిచ్చెయ్యాలని అనుకున్నాను, కాని ఇవ్వలేదు. ఎందుకు? కేవలం కళావల్ల. వాడికి తల్లంటే ఇష్టం. తండ్రంటే ఇష్టం లేదూ? ఎందుకులేదు? నేనన్నా ఇష్టమే వాడికి! అఖిలకి నేనంటే అసహ్యం, కాని కళావల్ల ఆ అసహ్యాన్ని పూర్తిగా ఎప్పుడూ బయటపెట్టేది కాదు.

ద్వేషంలో పుట్టిన కళా ప్రేమించడం మొదలు పెట్టేడు — తల్లినీ, తండ్రినీ!

వాడివల్ల నా జీవితానికి ఒక రకమైన తృప్తి లభించింది.

కాని, చెప్పేనుకదూ? పెద్ద మనిషినైన నాలో చిన్నబుద్ధి మొగ్గలు వెయ్యడం ప్రారంభించింది.

తల్లినీ తండ్రినీ మాత్రమే ప్రేమించలేదు కళా. ప్రపంచాన్నంతటినీ ప్రేమించేడు. ఒకర్నో ఇద్దర్నో ప్రేమించడం ప్రేమించడం కాదనీ, ప్రేమికుడికి అవధులులేవనీ అప్పుడు నాకు తెలీదు. ద్వేషంతో ద్రవ్యాన్ని పెంచడం తెలుసుకున్న నాకు ప్రేమంటే ఎట్లాంటిదో తెలిసే అవకాశం ఎక్కడ?

అవును, కళా ప్రేమించేవాడు. ఫ్యాక్టరీని నేను ప్రేమిస్తే, ఫ్యాక్టరీ వర్కర్లని తాను ప్రేమించేవాడు. డబ్బును ఇనప్పెట్టెలో పెట్టి నేను ప్రేమిస్తే పోకెట్ మనీగా నేనిచ్చిన వందలూ వేలూ అడిగిన వాడికల్లా లేదనకుండా ఇచ్చేసి "నా దగ్గర డబ్బుంది కాబట్టి

ఉన్నాను - అవసరానికి వినియోగ పడడానికేగా డబ్బు-" అని, ప్రాణంలేని కరెన్సీ నోట్లని ఆ రకంగా ప్రేమించేవాడు కళా, చిన్న పిల్లల్ని ప్రేమించేవాడు, స్నేహితుల్ని ప్రేమించేవాడు, జీవితంలో దెబ్బతిన్నవాళ్ళని ప్రేమించేవాడు, దౌర్భాగ్యుల్ని, దీనుల్ని, హీనుల్ని అందర్నీ ప్రేమించేవాడు!

"ఇంతకీ కళాధర్-అదే చంద్రకళాధర్‌తో మీకు ఏమీ ఎందు కొచ్చినట్టు?-"

"నాకా? ఏమీయా?" ఆగి నవ్వేడు ధనపతి.

"ఏమో! కళాతో నాకు ఏమీ వొచ్చిందో- కళాకి నాతో ఏమీ వొచ్చిందో నా కిప్పటికీ సరిగ్గా పూర్తిగా అర్థం కావడంలేదు"

"ఎవరిలో-ఎవరికి అయినా.. ఏమీ మాట అబద్ధం కాదు కదా.?"

"కాదు."

"అయితే అవెందుకొచ్చినట్టు?"

ధనపతి నావేపు చూసేడు, లోతుగా, వెదుకుతూన్నట్టుగా. చూసి నవ్వేడు మళ్ళీ యిలా చెప్పేడు—

కారణాలు కావాలి నీకు. ఏది జరిగినా అలా ఎందుకు జరిగిందో కారణం చెప్పాలి. జరిగిందానికి కారణం, జరగని దానికి కారణం, ఏమీ వొచ్చినా కారణమే! ఏమీ రాకపోయినా కారణమే! అయిన దానికీ కానిదానికీ ప్రతి చిన్న విషయానికీ కూడా కారణం చెప్తుంటావు నువ్వు. నువ్వేకాదు; ప్రపంచమే అంత. కొన్నిటికి కారణాలుండవు. ఉన్నా తెలిసే కారణాలు కావు, తెలిసినా చెప్పేవికావు, చెప్పినా నమ్మేవి కావు......

దగ్గుతో ఆయాసపడుతూ ఆగేడు ధనపతి. మంచినీళ్ళు అందించేను. గటగటా తాగేసేడు,

"థేంక్స్!",

(ఇంకా వుంది)

---

# రాత్రులు

## శ్రీ దిలావర్

మల్లెల పూల కుప్పలు మోసుకొస్తున్న
మబ్బుల తెప్పలను
సుతారంగా తాకే వెన్నెల కెరటాలతో—
కొమ్మల చంక దిగి
పూరెమ్మల గుండెల్లోకి జారి
గుస గుసలాడే పిల్లతెమ్మెరలతో—
లోయలను మత్తులోకి జోకొడుతూ
కొండల కోనల గుండెల్లో స్పందిస్తూ
విశ్వాన్ని ఉబ్బించే
పక్షుల సంగీతంతో-
పింటి చీరలు విప్పి
అమవసగట్టు మీద వేసి
హిమజలపాతంలో
నగ్నంగా జలకాలాడే
ఆమని లేమలతో—
సుసంపన్నమైన యీ నిశీథులు
ఏ రసవత్ కావ్యాలను తమలో దాచుకున్న,
ఏ రమ్యమైన కళలను సొంతం చేసుకున్న,
అతిలోక సౌందర్య నిధులు....?
అందుకే—
ప్రతిరేయి ముందూ గుండెలు చాపుతున్నాను
ఓ గుప్పెడు మధుర కవితలు దానం చెయ్యండని!
ప్రతిరాత్రికీ రిక్త నేత్రాలు చూపుతున్నాను
ఓ పిడికెడు కళలు ప్రదానం చెయ్యండని

# కట్నాలు తీసుకోవచ్చు!

నేను కట్నం తీసుకునే పెళ్లి చేసుకున్నాను!

ఆడపిల్లల తండ్రుల్ని అష్టకష్టాలుపెట్టి యిన్నాళ్లూ వేధించుకు తిన్న మామూలు కట్నంకాదు. అంటే, గుట్టు చప్పుడు కాకుండా గుంజుకునే "వరకట్నం" కాదు. నేను తీసుకున్న కట్నం నీతికీ నిజాయితీకి మారుపేరు. వర్ణాంతర వివాహానికి మద్దతుగా ప్రభుత్వం మా దంపతులకిచ్చిన ప్రోత్సాహక బహుమతి.

వరకట్నం ఆశించే దురాశాపరుల్ని శిక్షించే ప్రభుత్వం మమ్మల్ని మనసారా ఆశీర్వదించింది.

వెయ్యి రూపాయల ఆర్థిక సహాయం అందించింది.

ఇది ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల్లో చెప్పక చెప్పిన అంతర్గత నైతిక సూత్రం.

ఈ కట్నం మీరూ పొందండి.

వరకట్న పిశాచాన్ని సమాజానికి దూరంగా పారద్రోలండి!

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

5/76 తెలుగు

# ఊహా విహంగం

శ్రీ ఎస్. శ్రీవర్ధన

కాల్పనిక జగత్తులో నివసిస్తున్న వాణ్ణి
కలల పూదోటల్లో విహరిస్తున్నవాణ్ణి

కష్టాలనూ, కన్నీళ్ళనూ లోలోపల దాచుకుని
కాంక్షల స్వర్గద్వారాల కేసి ఎగిసిపోతున్నవాణ్ణి

ఆకాశం ఆవలి తీరం మీద
ఆనందం క్రొత్త నక్షత్రంలా మెరిసిపోతున్నవాణ్ణి

అన్నా!
నన్ను కదిలించకు

కన్నీళ్ళనూ, కష్టాలనూ చూపించకు
వెన్నెల వెలుతురుల్లో ఆడుకుంటున్నప్పుడు

కలిసిపోయిన అమావాస్య నల్లదనాన్ని
చూపించకు ... ... ... ... ...

ఎప్పుడో నా కవిత్వంలో
కర్పూరపు సువాసనలు గుప్పుమంటాయని

ఎప్పుడో నా కవిత్వంలో
ఏడురంగుల పూలు రెక్కలు విప్పుకుంటాయని

ఎన్నెన్ని కలలు, నా చుట్టూ
ఎన్ని కాంక్షల వలలు ... ... ... ...

... ... ... ... ... ... ... ...
మన్నించు నేస్తం నేను

కన్నీరు గురించి వ్రాయలేను
మానవత్వం మరుగుపడిపోయిన

మనుష్యుల గురించి పాడలేను
ఈ ప్రశాంత కాసారంలాంటి హృదయాన్ని కలచకు

నన్ను మళ్ళీ మళ్ళీ పిలవకు
నన్ను ప్రమత్తతలోకి, ఆనందం

సుషుప్తిలోకి జారిపోనీ ... ... ...
అపుడు వ్యథా మరుత్తు నాకేసి ప్రసరించదు

అశ్రుకణ సరిత్తు నా గుండెల మీంచి ప్రవహించదు
నా పాట దిగంతాల కవతల ఉదాత్తంగా వినిపిస్తుంది

నా కవిత నవ కవితోద్యానాన నూత
వాసంత సుమాలు వికసిస్తుంది.



# పురాతన జైన అవశేషములు-ఆంధ్రకోస్తా ప్రాంతమునకు జైనవలసలు

డా. టి. వి. జి. శాస్త్రి.

హిందూదేశమున అసంఖ్యాకములైన జైనావశేషము లున్నవి. ఇవి ముఖ్యముగా పురాతన దేవాలయములు, శిథిల స్థితిలోనున్న గుహాలయములు, పూర్వకాలపు నగరములు, స్తూపములు, రాతిశాసనము మొదలగువాని రూపములోనుండును. బౌద్ధావశేషములకు నిలయమైన అమరావతి, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములు, ఎట్లు కొన్ని వందల సంవత్సరములకు ఒక ప్రత్యేక 'సాంస్కృతిక'స్థాయిని సూచించెనో, అట్లే కొన్ని జైనపవిత్ర స్థలములు, ఒక సాంస్కృతిక స్థాయిని సూచించి, కాలగర్భమున కలిసిపోయినవి. దీనికి ముఖ్యకారణము, ప్రభువులు, ప్రజల ఆదరణ తగ్గుటయని కొంతవరకు చెప్పుకొనవచ్చును. ఒక దేశ చరిత్రలో ఒక మతమునకు చెందిన సంస్కృతి కొన్నివందల సంవత్సరములు సజీవముగా నున్నదనగా అ, మతోద్ధారకులయిన, పండితులను పామరులను ఉత్తేజింపచేయగలిగిన ప్రబోధకులు, కొంతవరకు కారణమని కూడ చెప్పవచ్చును. అందువలన మతప్రచారములో, ప్రబోధకుల అశేష ప్రతిభాశక్తి ఎంతో అవసరము.

ప్రప్రథమముగా హిందూదేశ చరిత్రలో జనరంజకమైన ప్రబోధములు సలిపి జైనమతమునందు ఖ్యాతిగడించిన ధర్మప్రవక్తలలో మొదటివాడు పార్శ్వనాథుడు, రెండవవాడు మహావీరుడు. పార్శ్వనాథుడు చరిత్ర కందని కాలమువాడగుటచే, వాని ప్రబోధములను గూర్చి మనకు విస్పష్టముగా తెలియదు. రెండవవాడు మహావీరుడు, బుద్ధుని సమకాలికుడు. వీరిద్దరు మానవ రూపములో అవతరించి ప్రబోధములు సలిపి చరితార్థులైరి.

జైన గ్రంథములలో వీరిద్దరును తీర్థంకరులను పేరుతో వ్యవహరింపబడుచున్నారు. బౌద్ధులవలె నిర్వాణమనగా వీరు జన్మ రాహిత్య సిద్ధాంతమునందు నమ్మకమున్నవారు కారు. అనేక జన్మల నుండియు వచ్చుచున్న ప్రాపంచిక బంధము లన్నిటిని వదలించుకొని ఉత్తీర్ణులై తమ తమ ఆత్మలకు అమరత్వమును సంపాదించుకున్న (దివ్యస్వరూపులు) [1] ఇట్టివారు మొత్తము ఇరువది నలుగురు కలరు. వీరిలో ఇరువది మూడవవాడు 'పార్శ్వనాథుడు' ఆఖరివాడు 'మహావీరుడు.'

మహావీరుడు 'లిచ్ఛవి' వంశమునకు చెందిన క్షత్రియరాజు. ఇతడు బుద్ధుని సమకాలికుడగుటచే [2] స్థూలముగా క్రీస్తుకు పూర్వము 6వ శతాబ్దమువాడని తెలిసికొనవచ్చును. [3] ఇక 'పార్శ్వనాథుని' కాలమును గురించి తెలిసికొనుట గూడ ఎంతో అవసరము. కాని ఇది నిర్ణయించుట చాల కష్టము. ఏలననగా, వీని కాలమునాటి అవశేషములుగాని, సాహిత్యముగాని, చరిత్రగాని, తెలిసికొనుటకు ఆధారములేమియునులేవు. కాని అనుశ్రుతముగా వచ్చినగాథలు, తరువాత వ్రాయబడిన జైన గ్రంథములనుండి, కొంత కాలనిర్ణయము చేయుటకు వీలగుచున్నది.

జైన గ్రంథములలో, ఇప్పుడు మనకు తెలిసినవానిలో అతి ప్రాచీనమైనది 'బృహత్కథాకోశము'. ఇది 'దిగంబర' జైనులకు ప్రమాణ గ్రంథము. దీనిలో మథుర (ఆగ్రా సమీపములో) లోని పంచస్తూప నికాయమును గురించి కొంత సాహిత్యము సేకరింపవచ్చును. ఇచట 'కంకాళీ టిల' [4] అను ప్రదేశమునందున్న స్తూపము దేవనిర్మిత మని సూచింపబడియున్నవి. దీనిని పురస్కరించుకొని అచట త్రవ్వింపగా, జైన బొమ్మ పీఠమొకటి వెలువడెను. దానిపై ఒక శాసనము గలదు. దీనిలో కూడ 'వోడస్తూపము' దేవనిర్మితమని ఉదహరింపబడియున్నది. [5] ఈ శాసనములోని లిపి రెండవ శతాబ్దమునకు చెందినదైయున్నది.

కాగా ఈ జైనస్తూప ప్రస్తావన ఇతర జైన గ్రంథములలో కూడ గలదు. వీనిలో ముఖ్యమైనది హరిభద్రసూరి యనువానిచే వ్రాయబడిన 'ఆవశ్యకనిర్యుక్తి' ఇతర గ్రంథములు, యశకీర్తి లిఖితంపు హరివంశము, అయితే 'జినప్రభ' యని వానిచే క్రీ శ. 14వ శతాబ్దమున ఒక గ్రంథము వ్రాయబడెను. దీనిలో కంకాళి టిలస్తూపము ఇటుకలతో నిర్మింపబడినదనియు, ఇది 'సుపార్శ్వనాథుని' స్మారకచిహ్నమనియును వ్రాసెను. అంతియేకాక, ఈ నిర్మాణము మహావీరుని నిర్వాణమునకు 250 సంవత్సరములకుముందు జరిగెననికూడ వ్రాసి

యున్నది [6] దీనినిబట్టి మహావీరుడు క్రీ. పూ. 6వ శతాబ్దమునకు చెందినవాడైనచో, అంతకు 3 శతాబ్దముల ముందనగా క్రీస్తుకు పూర్వము 9వ శతాబ్దము పార్శ్వనాథుని కాలమని తెలుచున్నది. ఇందువలన కంకాలితిల స్తూపము, దానిలోనున్న అవశేషములు, ప్రప్రథమ జైన సంస్కృతిని నిర్దేశించుచున్న విషయము గట్టిగా చెప్పవచ్చును.

ఇక వీరిద్దరకు ముందు అవతరించిన తీర్థంకరులను గురించి తెలిసికొనుట కొంత అసాధ్యము, ఏలననగా పార్శ్వనాథునకు ఎనుబది నాలుగువేల సంవత్సరములకుముందు (84000) నేమినాథుని కాలము. వీరందరకును ప్రథముడైన ఆదినాథుడు కొన్ని యుగాలకు, ముందువాడు. దీనినిబట్టి వీరందరును చరిత్రకు అందని దేవపురుషులుగానే భావించాలి.

ఇది యిట్లుండగా క్రీ. పూ. 6వ శతాబ్దమునకు చెందిన 'మహావీరుని' గురించి జైనగ్రంథములలో కొన్ని గాథలు కలవు. ఈ గాథలకు ప్రమాణములు, ఆవశ్యకచూర్ణి [7] నిశీథచూర్ణి, [8] వసుదేవహింది [9] మొదలగునవి. వీనియన్నిటిలో 'జీవంతస్వామి' ప్రస్తావన యున్నది. మహావీరుడు తన జీవితకాలములోనే పూజించి ఆరాధింపబడినాడట. ఇందువలననే వీనికి 'జీవంతస్వామి' అని పేరు వచ్చెనట. దీనికి తార్కాణముగా మానవాకృతిలోను, మానవ పరిమాణములోను, గంధపు చెక్కలతో తయారు కాబడిన ఈతని విగ్రహమును గురించి ఒకగాథకలదు. ఉజ్జయిని దేశపురాజగు ప్రద్యోతుడు, ఈ విగ్రహమును అపహరించి, విదిశాపట్టణమున, నెలకొల్పి పూజించెను. [10] గుజరాత్ రాష్ట్రమున బరోడాకు సమీపమున 'అకోటా' అను గ్రామమునందు త్రవ్వకములలో జీవంతస్వామి విగ్రహములు కొన్ని బయటబడెను. ఇవి యు. పి. షా 'జైన కళాధ్యయనము' (Studies in Jaina Art) అను గ్రంథమున ప్రచురించిరి. వీనితోబాటు దొరికిన అవశేషములలో చక్కటి సరస్వతి విగ్రహము కూడ కలదు. ఇవి యన్నియు క్రీ. శ. 5–6 శతాబ్దముల నాటివని నిర్ధారణ చేయబడెను. [11]

జైన ధర్మమునకు సంబంధించిన అతి ప్రాచీనమైన కట్టడములు, బీహార్‌లోని బరాబర, నాగార్జుని కొండలలోని గుహలు. ఇవి ఇప్పటికినీ చూడవచ్చును. ఇవి మౌర్యుల కాలమునాటివి (క్రీ.పూ. 3వ శతాబ్దము). ఇవి జైన ఆజీవకులకు నెలకొల్పబడెను. ఈ ఆజీవక సంస్థకు మూలపురుషుడు మంఖలి పుత్రగోసల. ఇతడు మహావీరుని శిష్యుడు.[12] అశోకుని, తరువాత మౌర్యరాజులు, సంప్రతి దశరథుడు ఈ 'ఆజీవక' సంస్థయందభిమానముకలవారు. వీరి పేర్లుపైన చెప్పిన గుహలలో చెక్కియుండబడుటచేత, గుహలు మౌర్యుల కాలమునకు చెందినవని చెప్పుకొనుటలో ఆక్షేపణలేదు:

పోగా ఇతరజైన అవశేషములలో లోహానిపూర్‌లో దొరికిన విగ్రహము ఒకటి గలదు. ఇది 'నగ్నముగా' మానవాకృతిలోనున్న మొండెము. త్రవ్వకములలో దీనిని క్రీ. పూ. 3వ శతాబ్దమునకు చెందినదని నిర్ధారణ చేసిరి.[13]

మత సంబంధమైన ప్రకరణములో అతి పవిత్రమైనది చైత్యము. జైన సూత్రగ్రంథములలో ఈ చైత్య పూజను గురించి కొంత ప్రస్తావన యున్నది. వీనిని ఊరికి వెలుపల నెలకొల్పెడివారట. ఆచరంగ సూత్రములో ఇంద్రుడు, రుద్రుడు, స్కందుడు, ముకుందుడు, యక్షుడు, నాగులు మొదలగు వానితోబాటు ఈ చైత్యములుకూడ పూజింపబడెను, అని వ్రాసియున్నది.[14] బౌద్ధ చైత్యములు, చైత్య వృక్షములవలె, ఇవియును, మహావీరుని పరినిర్వాణమును నిర్దేశించును.[15]

క్రీ. శ. 1, 2 శతాబ్దములలో ముఖ్యముగా కుషాన్‌రాజుల కాలములో జైనమతం కొంతవరకు వృద్ధిపొందెను. ఈ కాలమునందు స్తూపములు చైత్యములేగాక, ధర్మచక్రములు, 'ఆయాగపట్టము'లు (జైన పవిత్ర చిహ్నములు చెక్కిన రాతిబిళ్లలు) ధ్వజములు. స్తంభములు, శ్రీవత్స, పద్మము, మీనయుగళము, మొదలగునవన్నియు తీర్థంకరులతోబాటు, పూజింపబడెడివి. మథురలోని త్రవ్వకములలో ఒక 'ఆయాగపట్ట'ము లభించెను. దాని క్రిందనున్న శాసనములో నమో అర్హతో మహావీరస మథురకస...[16] అని వ్రాసియున్నది.

మరికొన్ని ఆయాగ పట్టములలో స్తూపచిత్రమునుగీచి, దాని ఇరుప్రక్కలను భక్తులు ప్రణమిల్లుచునట్లు గలవు. లక్నో సంగ్రహాలయమునందు భద్రపరచిన రాతి బిళ్లలో ఋషభ నాథుని ఎదుట, నిరంజన నృత్యము జేయుచున్న చక్కని దృశ్యము గలదు[17]

కోస్తా ఆంధ్ర ప్రాంతములో కొంతమంది జైన ప్రచారకులు వలసవచ్చి మత ప్రబోధము చేసిరి అని చెప్పుటకు కొన్ని ఆధారములు గలవు. ఈ కోస్తా ప్రాంతమునకు ఒరిస్సా రాష్ట్రము దాటిరావలెను. ఇందువలన ఒరిస్సా ప్రాంతములయందున్న జైనావశేషములను తెలిసికొనుట ముందు అవసరము. వీనిలో అతి ప్రాచీనమైనవి ఖండగిరి — ఉదయగిరి కొండలు. వీనిలో హాథిగుంఫా అను గుహలో ఒక శాసనము గలదు. ఈ శాసనము అర్హతులకు, సిద్ధులకు ప్రణయాంజలితో మొదలిడును గావున, ఇది జైన సంప్రదాయమునకు చెందినదని చెప్పుకొనవచ్చును. ఇది చేడి రాజగు ఖారవేలునిచే వేయింపబడిన శాసనము. మగధరాజగు నందుడు ఈ ప్రాంతమును జయించి జైన విగ్రహము నొకదానిని అపహరించుటచే, ఖారవేలుడు, తిరిగి మగధపై దండయాత్ర సాగించి, ఆ విగ్రహమును తిరిగి తీసికొనివచ్చుట వాని దిగ్విజయ ప్రస్తావన శాసనమునందగుపించును.

పైన ఉదహరించిన జైన విగ్రహము పార్శ్వనాథునిదని ఊహించవచ్చును. ఏలనన శ్వేతాంబర దిగంబర జైన సంప్రదాయముల సాహిత్యములయందును, ఈ ప్రదేశమునందు పార్శ్వనాథుని పూజలు జరుగుచుండెడివని తెలియజెప్పుచున్నవి. దీనినిబట్టి మహావీరుని కాలమునకు ముందుగనే, ఈ ప్రదేశమునందు జైనమత స్థాపన అయినట్లు మత ప్రచారములు జరిగినట్లు తెలియుచున్నది. కోస్తా ఆంధ్రప్రాంతమునందుకూడ పార్శ్వనాథుని పూజలు, మత ప్రచారము మౌర్యుల కాలమునుండి జరుగుచుండెడివని చెప్పుకొనుటలో ఆక్షేపణలేదు.

కాని పురావస్తు శాస్త్రవేత్తలకు, ఆంధ్రదేశమున ఎక్కువ జైన అవశేషములు ఎందుకు కనిపించవు అను సమస్య వెలువడును. వివరమునకు ఏవో కొన్ని దృష్టాంతములు ఉండితీరవలెను. ఇది కొంత విమర్శన దృష్ట్యా ఆలోచించి చూచిన, ఈ మధ్య బయటబడిన అవశేషములు కొంత ఈ సమస్యను పరిష్కారము చేయుటకు ఉపయోగపడును.

భౌగోళికముగా కోస్తా ఆంధ్రప్రాంతమంతయు, ఎత్తైన కొండలుగాకాక, బల్లపరుపుగనుండి, క్రింద కనిపించు చిన్నటి బయళ్ళ అందమును తిలకించుటకు చక్కగనుండును. క్రింద ప్రవహించు నదులు, కొండలపైన వసతులు ఏర్పరచుకొనుటకు వీలు కలుగ చేసినవి. ఇందువలన విమర్శన దృష్ట్యా ఈ కొండలలో కనుపించు అవశేషములను చూచినచో, జైన సంస్కృతి ఛాయలు కొన్ని కనిపించుచున్నవి. వానిపై ఇప్పుడు పైకి కన్పించు బౌద్ధావశేషము లన్నియూ, క్రీ. పూ. రెండవ శతాబ్దమునాటివి కావనియు క్రీ. శ. 6వ లేక 7వ శతాబ్దము తరువాత వచ్చినవని వానిలోనున్న వాస్తు శిల్పకళ మొదలగువాటివలన తెలియుచున్నది.[18] కాగా అలెగ్జాండర్ ఈ ప్రాంతములందు గావించిన త్రవ్వకములలో దొరికిన 'ఆయాగ పట్టములు' స్వస్తికలు, మట్టి ముద్రలు, గొడుగు బిళ్ళలు మొదలైనవి.[19] ఇవియన్నియు మధురలో దొరికిన పూర్వజైన అవశేషములను బోలియున్నవి.[20] వీటితోపాటు ఈమధ్య గుంటుపల్లిలో బయటబడ్డ మహామేఘవాహనుని (ఖారవేల) శాసనము జైన సంప్రదాయమును ధ్రువపరచుచున్నది.[21]

ఇక గుంటుపల్లిలోని గుహలకు, బీహారులోని 'ఆజీవక' లకు నిర్దేశింపబడిన గుహలకు,[22] వాస్తు విషయములో ఏమాత్రము తేడా కనిపించదు. గుండ్రముగానున్న చైత్యగృహము, వృత్తాకారములో గొడుగువలె కన్పించు వితానము, మొదలగునవి బీహారు కొండలలో తప్ప, ఆంధ్రప్రాంతములలో మరెచ్చటను కనుపించదు కాగా, గుంటుపల్లి కొండపైనున్న శిలాస్తూపములు, బొజ్జన కొండలోని ఏకాండిక శిలాస్తూపములు,[23] ఒకే రకముగ కన్పించును.

ఇవిగాక, రామతీర్థం, శాలిహుండం మొదలగుచోట, రాతిలో మల్చబడిన చిన్న చిన్న ఉద్దేశిక స్తూపములు కొన్ని త్రవ్వకములలో బయటబడెను.[24] ఇట్లుండగనే, 'కంకాళితిల', త్రవ్వకములలో బయటబడ్డ రాతి ఫలకముల బొమ్మలలో కనుపించును. ఇవియును, ఆ యాగపటములు, స్వస్తిక మొదలగు జైన పూజార్హములైన పవిత్ర చిహ్నములు.

ఇక ఒరిస్సా–కోస్తా ఆంధ్ర ప్రాంతములలోని అవశేషములు, కృష్ణానదీతీర ప్రాంత అవశేషములు, రెండు భిన్న సంప్రదాయములను సూచించుచున్నవి. కాని ఈ రెండు మౌర్యుల కాలమునాటివే. శాలిహుండం కొండపై అశోకుని పేరు లిఖింపబడిన శిలా పీఠ మొకటి దొరికినది.[25] అమరావతిలోని త్రవ్వకములలోని ఎన్.బి.పి. మృణ్మయ పాత్రలు, కృష్ణానదీప్రాంతమున మౌర్యులకాలమును సూచించుచున్నవి.[26] వీరి కాలమున అయోధ్యలోని ఇక్ష్వాకు వంశపు రాజులు కొంతమంది కోస్తా ప్రాంతములోని జైన సంప్రదాయమునకు మరికొందరు వింధ్య పర్వతములనుదాటి, పశ్చిమగోదావరీ ప్రాంతము మీదుగా, దక్కన్ పీఠభూమినిచేరి, కృష్ణానదీ ప్రాంతమునకు వలస వచ్చిన ఇక్ష్వాకులు, బౌద్ధ సంప్రదాయమునను కారకులైరని ఊహింపవచ్చును.

కోస్తా ఆంధ్ర ప్రాంతములకు వాయవ్యముగానున్న బిలాస్ పూర్ చత్తీస్ ఘడ్ ప్రాంతము ఒకప్పుడు 'మహా కోసల' అని పిలువబడుచూ యుండెడిది. ఇది మౌర్యుల కాలములో నాగజాతివారి స్థావరమై యుండెను. వీరిచట రాజ్యమేలినట్లు వారి తనముగా, పురావస్తు శాస్త్రరీత్యా ధ్రువీకరింపవచ్చును.[27] వీరికి కేవలము సర్పము పై నమ్మకము తప్ప మరేమతమును దగ్గరకు రానిచ్చెడివారు కారు. అయినప్పటికీ మహావీరుని ప్రబోధములకు ముగ్ధులై జైన మతమును అవలంబించిరి. తిరిగి జైన ప్రబోధకులు, నాగపూజలను ఆదరించి యుండుటచే, నాగవంశజులలో జైనధర్మమునందు గురి కుదిరి యుండవచ్చును. ఒరిస్సా ఆంధ్ర, మైసూర్ ప్రాంతములో ఇప్పటికి కనుపించు నాగ ప్రతిష్ఠలు, పూజలు మౌర్యకాలమునాటి జైన ప్రబోధకులు, ప్రజలలో కల్పించిన నమ్మకమై యుండవచ్చును.

ఇక జైనమతం కోస్తా ఆంధ్ర ప్రాంతమునందు ప్రవేశపెట్టిన ఇక్ష్వాకు లెవ్వరు అన్న ప్రశ్నకు క్రీ. శ. 12 వ శతాబ్దమునకు చెందిన, ధర్మామృతమను, దిగంబరశాఖ ప్రమాణ గ్రంథములో ఈ గాథయున్నది.[28]

అంగదేశంలో యశోధరుడను ఇక్ష్వాకు రాజుండేవాడు ఇతడు జైనమతాభిమాని. వెంగిమండలమందున్న ప్రకృతిశోభకు ముగ్ధుడై, ప్రతీపాల పురమనుచోట స్థావరమేర్పరచుకొని, రాజ్యమును తన

ముగ్గురు కొడుకులైన, అనంత వీర్యుడు, శ్రీధరుడు, వీరబలుడు, అనువారికి వదలి తపస్సు జేసుకొనుచుండెను. తరువాత వాని కొడుకులుకూడ ఈ ప్రదేశమును చూచి ముగ్ధులై జీవన్ముక్తికి, తండ్రివలె తపస్సుచేయుటకు నిశ్చయించుకొనిరి. కాని మంత్రి రాజ్యభ్రష్టమగునని, ఆలోచించి, పెద్దవానిని తిరిగి అంగదేశమునకు తీసుకొని పోవుటకు ప్రయత్నముచేసెను. కాని జైనధర్మపరాయణుడై తపస్సులో నిమగ్నుడైయుండెను. లాభములేక రెండవ వాని నడుగగా, ప్రతీపాల పురము(భట్టిప్రోలు) ననేయుండి రాజ్యముచేసెదని మంత్రికి మాట ఇచ్చెను.[29]

ఇక అంధ్రదేశమునకు, అనగా అంధ్ర అను పదమునకు, జైనులకు కొంత సంబంధం కనిపిస్తుంది. అంధ్ర, అంధ అను ప్రాకృత పదమునుండి వచ్చినదని చెప్పబడుచున్నచో, అంధులు గుడ్డివారా అన్న ప్రశ్నకు, ధర్మామృతమందు ఒక జైనగాథ కలదు.[30]

ప్రతిపాల పురమునందు 'ధనదుడను', ఇక్ష్వాకురాజు పరిపాలిస్తూవుండేవాడు. అతడు సంఘసిరియనువాని కుమార్తెయైన 'కమలసిరిని' పెండ్లాడెను. సంఘసిరి అపారమైన బౌద్ధ ధర్మాభిమాని. ధనదుడు జైనుడగుటచే తన భార్య, మామగారి అభిప్రాయములు కొంత కటువుగా వుండేవి. అయితే తన భార్యయైన కమలసిరిని ఒప్పించి, జైనమతం ఇప్పించాడు. కాని మామగారిని మటుకు ఒప్పించలేకపొయ్యాడు. ఒక సందర్భంలో జైన 'చరణరాసులు' వచ్చి తన కొలువుకూటమునందుండగా, బౌద్ధుల ప్రస్తావనవచ్చి, తన మామగారి అభిప్రాయమును వారికి చెప్పెను. దానికి వారు తమ ప్రతిభాశక్తిచే, జైన ధర్మముపైన సంఘసిరికి నమ్మకము గలిగించి, జైన ధర్మమును అవలంభించునట్లు వాగ్దానము తీసుకొని వెడలిపోయిరి. కాని అతడు, కొన్ని రోజులైనతర్వాత, తన అభిప్రాయమును తిరిగి మార్చుకొని, బౌద్ధుడయ్యెను. దీనికి చరణరాసులు కోపించి, సంఘసిరిని, బౌద్ధమతాభిమానులను, ఏడువంశముల వరకు అంధులగుదురని శపించి వెళ్ళిపోయెను. వేరే ప్రత్యక్షముగ ధాన్యకటకమునందు అంధులని వ్యవహరింపబడెడువారు.

దీనినిబట్టి జైనులకు, బౌద్ధులకు బద్ధ వైరములుండెడివని తెలిపోవుచున్నది. కాగా అమరావతిలో మొట్టమొదట అంధక[31] బౌద్ధులు, పూర్వ శైలులు అపర శైలులు, మహిషాశకులు, మొదలగు పేర్లతో శాఖోప శాఖలుగ విడిపోయిరి. తరువాత భట్టిప్రోలు ప్రాంతము (ప్రతిపాలపురము) మొదట జైనుల ముఖ్య స్థావరమై, తరువాత బౌద్ధుల ప్రాబల్యము ఎక్కువగుటవలన బౌద్ధస్థానముగ మారి యుండవచ్చునని తెలుచున్నది.

మహావీరుడు క్రీ. పూ. 6 వ శతాబ్దమునకు చెందినవాడని అందరకే తెలుసుకొంటిమి. ఇతడు తన జీవితకాలంలో, ఒరిస్సా దేశములోని కుమార గిరి ప్రాంతమునకువచ్చి, జైనధర్మమును బోధించినట్లుగ ధర్మామృతమందు ఉదహరింపబడియున్నది. తరువాత జైనమత ప్రచారములో ముఖ్య పాత్రవహించినవాడు, అతని శిష్యుడు భద్రబాహుడు.[32] ఇతడు అశేష ప్రతిభాశక్తి గలవాడగుటవేత, మౌర్యచంద్రగుప్త, మహారాజునే, అంధ్రదేశమునకు తీసుకొనివచ్చెనను గాథ శ్రీశైల ప్రాంతమునందు చెప్పుకొనెదరు. ఇతడే జైన ఇక్ష్వాకు రాజులు, కోస్తా అంధ్రప్రాంతమునకు వలస వచ్చుటకు, దోహద మిచ్చియుండవచ్చును.

క్రీ. శ. రెండవ శతాబ్దమున జైన మతమును పునరుద్ధరించుటకు మరికొందరు ధర్మప్రవక్తలు దక్షిణహిందూదేశమునకు వలస వచ్చిరి. దీనికి నాయకుడు కాలకాచార్యుడు. ఇతడు నిమిత్త శాస్త్రము క్షుణ్ణముగా తెలిసినవాడు. పంచకల్పమను గ్రంథమునకు భాష్యము రచించెను. గౌతమీపుత్ర శాతకర్ణి సమకాలికుడు. ఈ రాజులు కాలకాచార్యుడు చర్చించి ఆరాజ్య భవిష్యత్తును, ప్రపంచ భవిష్యత్తుకూడ చర్చించినట్లు తెలియుచున్నది.[33]

అమరావతిలో యిటీవల దొరికిన సంఘశాసనమునుండి, కొన్ని విషయములు సేకరింపవచ్చును.[34] ఈ శాసనములోని మూడవ పంక్తిలో కనేరణో బహూని, అను మూడు పదములనుబట్టి, కళింగదేశము దగ్గర ప్రాంతములలో, జైన తాపసులు నివసించు ప్రదేశములని ఎంచి యుద్ధములో ఆ ప్రదేశములను రక్తసిక్తము చేయుట ఇష్టము లేక, ఆపించెనని స్ఫురించుచున్నది. శాలిహుండం, రామతీర్థం, బొజ్జనకొండ, గుంటుపల్లి మొదలగు ప్రదేశములలో జైనబెట్టలు, బసతులు, తీర్థములు యుండెడివని, అచట కనుపించు అవశేషములనుబట్టి తెలుసుకొనవచ్చును.

ఇక బెట్ట, బసతి, మొదలగునవి క్రీ. శ. 7 వ శతాబ్దము వరకు యున్నట్లు చారిత్రకముగ గూడ తెలియుచున్నది. కోస్తా ప్రాంతమునేలిన చాళుక్యరాజగు కుబ్జ విష్ణువర్ధనుడు, జైనమతముపట్ల విస్తృత అభిమానమున్నవాడు. ఇతని భార్య అయ్యన మహాదేవి, విజయవాడలోని దుర్గ కొండపై 'నడుంబవసతి' నొకదానిని స్థాపించెను.[35] ఇది ప్రజ్ఞాశాలియైన కవి భద్రాచార్యుని ఆధ్వర్యంలో వుండెడిదట.

ఆంధ్రదేశములో క్రీ. శ. మూడవ శతాబ్దమువరకు, వ్యాపారము చేయువారిని శ్రేష్ఠులని పిల్చెడివారు.[36] ఇప్పుడుకూడ కొంత మందికి సెట్టి, చెట్టి అను పదములు వ్యవహారములోనున్నవి. కాని బాహుళ్యంగా వీరిని కోమట్లని పిల్చుచున్నాము. వీరు జైనులూ రాష్ట్రమునందుకూడ కోమట్లనే పిలువబడుచున్నారు. భద్రబాహు

ప్రబోధములకు ఉత్తేజితుడై శ్రావణబెళగోళ ప్రాంతమునందు స్థావరము చేసుకొనిరి. తరువాత గోమటేశ్వరుని ఆరాధ్య దైవముగ జేసుకొనిరి. వారే గోపురులు వ్యావహారికములో ఏరు కోమటులుగ రూపొంది యుండవచ్చును.

ఇట్లు జైనమత ప్రవక్తల వలనతెల్సియో కోస్తా ప్రాంతములకు వచ్చి జైనక్షేత్రములను ఏర్పరచిరి. కాని బౌద్ధులయందున్న నమ్మకము, ప్రజలకు జైనులయందు లేకుండెను. ఏలనన జైనధర్మ ధర్మమునందున్న కర్మకాండలు ఆచరించుటకు ఎంతో కష్టముగా నుండెడివి. బౌద్ధుల మాధ్యమికవాదము అర్థము చేసుకొనుటకు, సులభముగా నుండుటయేగాక, వైదిక కర్మలకు ఎక్కువ ప్రాధాన్యములేదు. ఇదియునుగాక, ఆచార్య నాగార్జునుడు, జయప్రభాచార్యులు, ఆర్యదేవుడు మొదలగు ప్రతిభావంతులు, బౌద్ధమత ప్రగతికి దోహదమిచ్చిరి.[37]

ఏది ఏమైనను జైన ప్రబోధములలో ముఖ్యముగ గమనింప వలసిన విషయము మానవ జీవిత పరమావధి [illegible] తద్ సత్యం అన్న సూక్తిలో కొంత ఆవేదన ఉండకతప్పదు కాని జైన ధర్మ ప్రకారము, ధర్మబద్ధముగానున్న జీవికి, ప్రాపంచిక బంధములనుండి తప్పించుకొని ఒక పవిత్రస్థాయిని అందుకొన్న స్వర్గసీమ. ఈ విషయమే ప్రతిభాశాలులైన ప్రవక్తలు, ఆంధ్రదేశమునకు ప్రప్రథమముగా అందజేసి, జైనమత స్థాపనకు దోహదము నిచ్చిరి.

## అథోజ్ఞాపికలు

1. బిర్లా మ్యూజియం ఆధ్వర్యంతో 'జైన సంస్కృతి'ని గురించి భోపాల్‌లో మార్చి 23 నుండి 25 వరకు సభలు జరిగెను. ఈ సందర్భమున తయారుచేయబడిన వ్యాసమును ఆధారము చేసుకొని ఇది తయారుచేయబడినది.
2. **Eneyclopidia of Religious and Ethics Vop No.**
3. చరిత్రలో క్రీస్తుకు పూర్వము 563 సంవత్సరమున ఇతడు జన్మించినట్లు తెలియుచున్నది. ఇది కేవలము బౌద్ధ సంగీతులను **(Buddhist councils)** ను ఆధారముగా చేసుకొని చెప్పగలిగినది. బౌద్ధుల 'సుత్తపిటక' వినయ పిటక అను గ్రంథములు, బుద్ధుని పరినిర్వాణము కాగానే సేకరించిరనియు, మొదటి సంగీతి, మూడవ సంగీతి మగధదేశమునందు రాజగృహములో జరిగెననియు, మూడవది అశోకుని కాలమున జరుగుటచే, గ్రీకుచరిత్రలో అశోకుని కాలము సంగతి ఉదాహరించి యుండుటవలన కూడ, పైన చెప్పిన క్రీ. పూ. 563 సంవత్సరములు సరిపోవుచున్నది.
4. **Smith V. Jaina Stupa Plate XII ;**
5. తారనాథుడు, నాగకళ, దేవకళ, అను పదములను వాడెను అశోకుడు మధురలోని స్తూపమును నిర్మించుటకు 'యక్ష కళాకారులను' వినియోగించినట్లతడు చెప్పెను. ఆవశ్యక వృత్తి అను గ్రంథములో నిర్యుక్తిగాథ 1012 పే 454 కూడ చూడుడు.
6. జినప్రభాసూరి వ్రాసిన గ్రంథం క్రీ. శ. 14 కాలంనాటి దైనప్పటికి, జైన అవశేషములు, కట్టడములను గురించి చాలా విపులముగా వర్ణింపబడి యున్నవి. మధురలోని జైన స్తూపము, పార్శ్వనాథుని కాలములోనే కొంత జీర్ణోద్ధరణ సంస్కారము జరిగెనని, తరువాత వెయ్యి సంవత్సరములైన తర్వాత, 'బప్పభట్టి సూరి' అను వానిచే తిరిగి జీర్ణోద్ధరణ గావింపబడెనని వ్రాసెను.
7. ఆవశ్యక చూర్ణి. పే 223-227.
8. ఇది ఒక తాళపత్ర గ్రంథము ఇది క్రీ. శ. 1100 శతాబ్దమునకు చెందినది.
9. ఇది జైన ధర్మంలో 'ప్రేమసాహిత్యాన్ని' నిర్దేశించు గ్రంథము. క్రీ. శ. 5వ శతాబ్దమునకు చెందిన 'సంఘదాసగని' వాచకమునకనుసరించి ఈ పుస్తకము వ్రాయబడెను.
10. మహావీర, బుద్ధుల చరిత్రలో 'ప్రచండ ప్రద్యోత' రాజును గురించి అనేక ప్రస్తావనలు కలవు. అలాగా ఇతడు వీరి సమకాలికుడని నిర్ధారణ యగుచున్నది
**Fuhrer A. Antiquities of the Buddha's birth place in the Napalese Tarai-1972. P. 5.**
జ్ఞాత ధర్మకథా సూత్రములోను, భాగవతి సూత్రములోను, మహావీరుని ప్రబోధములను విని, ఇతడు ఇంద్రుడో, రుద్రుడో అనుకొనెడివారని వ్రాసియున్నది.
11. **Subba Rao B. Baroda Through the Age P. 97-100**
12. **Fuhrer A** పైన ఉదహరించిన గ్రంథము చూడుడు
13. ఇది హరప్పాలో దొరికిన 'విశ్వదేవతామూర్తులు' అను పేరుతో వ్యవహరింపబడుచున్న అవశేషములను పోలి

యున్నది. జైన తీర్థంకరుని బొమ్మయై యుండవచ్చునని కొంతమంది అభిప్రాయము. దీనిపైనున్న 'నమవుదనం' ఒక్కటే మౌర్యుల కాలమునాటిదని చెప్పుటకు ఆధారమని కొందరి అభిప్రాయము.

14. యు. పి. షా గ్రంథమును చూడుడు. పే-6.

15. జైనులకు 'భూపుత్రిక,' 'గుణశిలా' చైత్యములు, బౌద్ధులకు గోతమ ఆనందచైత్యములు ముఖ్యముగా చెప్పుకొనదగినవి.

16. Epigraphia Indica Vol II. P. 200.

17. ఇది మహావీరుని జన్మదినోత్సవమును నిర్దేశించును.

18. కృష్ణానది ప్రవహించు ప్రాంతమునయున్న బౌద్ధక్షేత్రములకు కోస్తాప్రాంతములనున్న శాలిహుండం, రామతీర్థం బొజ్జనకొండ, మొదలగు బౌద్ధక్షేత్రములకు చాలా తేడా కన్పించుచున్నది. ఈ తేడా పూర్వపు సంప్రదాయములు మారి, మరొక సంప్రదాయమును అవలంబించుటలో వచ్చినది.

19. Annual Report of the Archaeological Department : Southern circle 1919-20. P. 38

20. Smith V. A. The Jaina Stupa Pl XX-XXII

21. Subrahmanyam R. The Guntupally Inscription of Kharavela.

22. Fuhcer : of cit P. 5.

23. Annual Report of the Archaeological Department : Southern circle 1908-09. P. 17.

24. హైదరాబాదు భారత పురావస్తు పర్యవేక్షణ కార్యాలయములో ఈ ప్రాంతమునుండి వచ్చిన జైన ఉద్దేశిక స్థూపములు భద్రపరుపబడియున్నవి.

25. Epigraphia Indica Vol XXXI, 14. P. 87, 88.

26. ధరణికోటలో ఎమ్. వెంకటరామయ్య త్రవ్వకములలోను, అమరావతిలో ఐ. కార్తికేయశర్మ త్రవ్వకములలోను ఇవి బయటబడెను.

27. Padmavati : Indian History Congress : (Gwalior) P. 28.

28. Desai P. B. Jainism in South India and some Jaina Epigraphs (1957) P. 2

29. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము 3. (1959) పే. 546. చేజర్లలోని కపోతేశ్వరస్వామి దేవాలయస్థలపురాణములో ఇదే గాథను సూచించుచున్నది. Sastri T.V.G. A Bhumija Temple from a chaityagrha అను వ్యాసము Itihas, Vol III No 1 చూడుడు. దీనినిబట్టి ఈ కపోతేశ్వరాలయము మొదట జినాలయమై యుండునేమో?

30. Desai P. B. I bid P.

31. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము 1034 పే. 29.

32. భద్రబాహుడు నమస్కార నిర్యుక్తిని ఆదేశించిన ప్రవక్త. ఇది ఇతడు రచించిన పంచపరమేష్టి మంత్రము.

"ణమో అరహంతాణం
ణమో సిద్ధాణం
ణమో ఆయరియాణం
ణమో ఉవజ్ఝాయాణం
ణమోలోఏ సవ్వసాహూణం"

33. Shah U. P. I bid P. 80

34. భారతి. మార్చి 73 పే 46.

35. Journal of Andhra Historical Research Society Vol XVI. P. 42.

36. స్కందక పర్వతశ్రేష్ఠినః అయకాసనము నాగార్జునకొండలో దొరికెను.

37. జగ్గయ్యపేటలో దొరికిన శాసనమునుబట్టి.

నీ చుట్టూ ఉన్నదాన్ని కాదంటావా?
కాదనలేను దానికి చరిత్ర ఉంది
కాదనలేను దానికి చికిత్స ఉంది
అంటరాని వారెవరో తెలుసుకోవాలి
అంటరానితనమేదో విమర్శించుకోవాలి.

* * *

బ్రాహ్మణుడనని చండాల విషం చిమ్మేవాడు
హైందవుడనని హిందూ ధర్మం లేనివాడు
వైదికుడనని త్రాగుబోతై తిరుగువాడు
జూదమాడువాడు— వ్యభిచారం చేయువాడు
పుట్టగానే కులం పుచ్చుకున్నవాడు
పారంపర్యతకు బీజమల్లినవాడు
నన్ను తాకకు అన్న విచార హీనుడు
విశాల ధర్మాన్ని వంటింట్లో దాచినవాడు
తన కోసం గుళ్ళు కట్టి మందిని రానివ్వనివాడు
మతం మారిన వాని చూచి బాధ లేనివాడు
దేశానికి ద్రోహం తలపెట్టేవాడు
విదేశాలకి దాసోహం అన్నవాడు
దొంగ వ్యాపారం చేస్తున్నవాడు.

ద్రోహానికి సమయం చూస్తున్నవాడు
ఆర్యదృష్టి లేనివాడు
హైందవ నిష్ఠ లేనివాడు
స్వాభిమానం లేనివాడు
శాస్త్రజ్ఞానం రానివాడు
మొద్దుబారిన మతంవాడు
బుద్ధి లేని తరంవాడు
వీరంతా అంటరాని వారు
వీరే అస్పృశ్యులౌతారు.

ఇలా ఉంటుంది నా హైందవం
ఆత్మోన్నతికి అది బాంధవం

* *

వికాస మార్గంలోనే విభిన్న తత్వాలు
విభిన్నతలో ఉన్నాయి ఏకతకు మార్గాలు
మతాచార్యులు చేసిన ప్రసంగాలు
నా జాతిలోన పరస్పర పూరకాలు

ద్వాదశ శతాబ్దాల బానిసను నేను
దారి తప్పిన మార్గాలనేకం భరించినాను
ఈ సుదీర్ఘ కాలంలో వెత్తు వెదారాలు
దురాచారాలు వచ్చి చేరినవిందులో
అంటరానితనంగా చోటు చేసుకున్నాయి సందులో.

ఈ దురాచారాలు కాల ప్రభావ జనితాలు
ఆ ప్రభావాల్లో మొలచిన పోరాటాలు
స్వార్థాల మోదల్లో ఇన్ని దినాలు బ్రతికినవి
ఆ చావరుల పిలకల్లో శాశ్వతంగా నిలిచినవి

కాలజ్ఞానం నా వాళ్ళకి కలిగిననాడు
కనిపించకుండా పోతుంది చూడు.

నేను విజ్ఞానం సాధించిననాడు
నా వైదిక లోకం శోధించిననాడు
నా ధర్మమేమిటో నాకు తెలిసిన రోజు
నన్ను తాకనన్నవాడు పట్టే బూజు.
మార్పుకోసం మతం మార్చుకోను
ప్రగతికోసం జడవాదం పూనుకోను
హైందవేతరుడికి నా హక్కు పంచరాదు
ఆర్య భావం లేనివాడు హరిజనుడు కాడు.
నేను ఆత్మాభిమానం గల అమృతస్య పుత్రుడను
నేను సంపూర్ణ హైందవుడను
నేటి ప్రపంచ శాంతికి బంధువుడను.

# స్వర్గీయ కోకా సుబ్బారావు: రాజ్యాంగ సంస్కరణలు

శ్రీ కాకుమాను తారానాథ్

"The people of the American States, holding the sovereignty in their own hands, have no occasion to exact any pledges from any one for a due observation of individual rights; but the aggressive tendency of power is such that they have deemed it of no small importance, that in framing the instruments under which their governments are to be administered by their agents, they should repeat and reenact this guarantee, and thereby adopt it as a principle of constitutional protection."

Judge Cooley in his "Constitutional Limitations" quoted by Justice Das in Goplan's case.

శ్రీ కోకా సుబ్బారావు మరణంతో భారత రాజ్యాంగ చరిత్రలో ఒక శకం ముగిసిందనవచ్చు. తాను ప్రారంభించిన, తాను ప్రతీకంగా నిలిచిన ధోరణిలో ఒక మార్పును [illegible] చూశాడు, కొన్నిటిపట్ల వ్యథచెందాడు, తన భావాలు వెల్లడించాడు, వెళ్ళిపోయాడు.

మనం ఆయన అభిప్రాయాలతో ఏంతమాత్రం ఏకీభవించకపోవచ్చు. కాని రాజ్యాంగంలో తీవ్రమైన మార్పులు వచ్చిన ఈ తరుణంలో ఆ అభిప్రాయాలను గురించి తెలుసుకోవటం మన కర్తవ్యం.

నిజానికి సుబ్బారావు ఒక ధోరణికి, ఒక అభిప్రాయానికి ప్రతినిధి మాత్రమే. 'కారవాన్' 1975 నవంబరు సంచికలో ఒక వ్యాసం వ్రాస్తూ, ఇదే భావాన్ని తేటతెల్లంగా చెప్పాడు. అవతలి కొందరు తాను న్యాయమూర్తిగా తీర్పుచెప్పిన ముఖ్యమైన కేసును గురించి వ్రాయమన్నారని, కాని ఒక బెంచిసభ్యుడుగా తానిచ్చిన తీర్పు తన సొంతతీర్పు కాదనీ, అది అందరిదనీ, కాబట్టి తన తీర్పును గురించికాక, ఒక తీర్పును గురించి వ్రాస్తానని వ్రాశాడు. అదే గోలక్‌నాథ్ వివాదము.

దీనికిముందు మనం కొన్ని విశేషాలను తెలుసుకోవటం అవ-

సరం. 1946 డిశెంబరు 9న రాజ్యాంగసభ ఏర్పడితే, 1947 భారత స్వాతంత్ర్య చట్టం ప్రకారం రాజ్యాంగ నిర్మాణ బాధ్యత ఈ రాజ్యాంగ సభకు అప్పజెప్పబడింది. 1947 జనవరి 22న ఈ రాజ్యాంగ నిర్మాణసభ ఒక తీర్మానంద్వారా—ఈ దేశంలో రాజ్యానికి గాని, ప్రభుత్వానికిగానిగలసర్వాధికారాలు—ప్రజలనుంచేవచ్చాయని వక్కాణించింది. 1948 డిశెంబరు10న ఐక్యరాజ్యసమితి జనరల్ ఎసెంబ్లీ మానవ హక్కులను గురించి ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇలా తయారైన రాజ్యాంగాన్ని మనకు మనమే 1949 నవంబరు 26న ఇచ్చుకున్నాం.

ప్రపంచంలోని లిఖితరాజ్యాంగాల్లో అమెరికన్‌రాజ్యాంగం చాలా ప్రాచీనమయింది. దానికొక ప్రాధాన్యత ఉంది. అప్పుడే బ్రిటిష్ పాలననుండి బయటపడ్డవారు, ప్రజాప్రతినిధులతో కూడిన సభలు కూడా [illegible] ప్రజల హక్కులమీద దండయాత్ర చేసేది అర్థంచేసుకున్నారు. కాబట్టి ప్రజలకు పరిపాలనా యంత్రాంగం (ఎగ్జిక్యూటివ్) నుంచే కాకుండా, శాసన సభా యంత్రాంగం (లెజిస్లేటివ్) నుంచి కూడా రక్షణ ఉండాలని భావించారు, ఆ విధంగా రాజ్యాంగ నిర్మాణం జరిగింది.

ప్రాథమిక హక్కులనేవి ఈ ధోరణికి ప్రతీకాలు మాత్రమే. నిజానికి మన రాజ్యాంగ నిర్మాణకాలంనాటికి దేశంలో ఏ విదేశీ ప్రభుత్వములేదు. జాతీయ ప్రభుత్వము ఉంది, ఉన్నదంతా భారతీయులే మరి వీరితోఎవరినుంచిఎవరికి,ఎవరిహక్కులవిషయమై హామీలు కావాలి? కేవలం ప్రజల సదభిప్రాయాలమీద, పరిపాలకులు తమను తాము స్వయంగా నిగ్రహించుకునే పరిమితులమీద రాజ్యాంగ నిర్మాతలకు నమ్మకం లేకపోయింది. కాబట్టే, ఏది ఏమైనా కొన్ని హక్కులకు ప్రాథమిక హక్కులని నామకరణంచేసి వాటిని క్రోడీకరించారు.

ఇంకొక విశేషం మనదొక మధ్యేమార్గము. అప్పటికే అనేక

లిఖిత రాజ్యాంగాలుండటంచేత వారి అనుభవాలను గ్రహించాం, వాటి విశేషాలను సంగ్రహించాం. బ్రిటన్‌లోవలె కేవలం పార్లమెంటుదే సర్వాధికారం అనలేదు, అమెరికాలోవలె సుప్రీంకోర్టు సర్వాధికారాన్ని అంగీకరించలేదు. మధ్యేమార్గ మవలంబించి ఎవరి పరిధులను వారి వారి కేర్పరచటం జరిగింది. అంతా, సర్వులూ—పార్లమెంటు, శాసన సభలు, న్యాయస్థానాలు, చివరికి రాష్ట్రపతికూడా—రాజ్యాంగానికి లోబడి ఉండాలని నిర్ణయించటం జరిగింది. కాబట్టే ప్రధాన న్యాయ మూర్తి హిదయతుల్లా 1971లో ప్రివీపర్సుల కేసులో ఈ విధంగా అనగలిగాడు: "న్యాయస్థానాలు తన చర్యలను ఎంతమాత్రం పరిశీలించటానికి వీలులేదని రాష్ట్రపతికూడా అనగూడదు. తనకు నచ్చినపుడల్లా సుబేదారులను ఇవ్వటానికి వీలయిన, ఘనత వహించిన మొగలు ప్రభువుల అధికారాలుగాని, బ్రిటిష్ ప్రభువుల సార్వభౌమాధికారాలుగాని ఆయనకు సంక్రమించలేదు." ఇవి మనకు కఠినంగా ధ్వనించవచ్చు, కాని వాస్తవమది.

రాజ్యాంగంలోని మూడవ భాగంలో ఈ ప్రాథమిక హక్కులు వివరింపబడ్డాయి. 13వ అనుచ్ఛేదం (ఆర్టికల్) ప్రకారం, ప్రభుత్వం ఏ చట్టాన్ని చేసినా అది ప్రాథమికహక్కులకు భంగకరంగా ఉండగూడదు. అలాఉంటే, భంగకరంగా ఉన్నంతవరకు అది చట్టం కాదు. అలాగే ఇరవయ్యవభాగం రాజ్యాంగ సవరణకు సంబంధించింది, అందులో ఒకేఒక అనుచ్ఛేదముంది 368. ఏపద్ధతి ప్రకారం రాజ్యాంగం సవరింపబడవలసిందీ ఇందులో వివరింపబడింది.

గోలక్‌నాథ్ వ్యవహారంలో కోర్టుముందుకొచ్చినప్రశ్న ఇది: 368 అనుచ్ఛేదం ప్రకారం జరిగిన రాజ్యాంగ సవరణకూడా "లా"యే కాబట్టి, అది ప్రాథమికహక్కులకు వ్యతిరేకంగాఉంటే, 13వ అనుచ్ఛేదం ప్రకారం చెల్లుతుందా చెల్లదా అని.

అయితే ఈప్రశ్న మొదటిసారి గోలక్‌నాథ్‌లోనే రాలేదు. రాజ్యాంగము మొదటిసారిగా 1951 జూన్‌లో సవరింపబడటంతోనే, శంకరప్రసాద్ వివాదంలో సుప్రీంకోర్టు ముందుకొచ్చింది. ఈ సవరణద్వారా 31ఎ, 31బి అనుచ్ఛేదాలు, 9వ షెడ్యూలు చేర్చబడ్డాయి. ఈ 9వ షెడ్యూలులో 13 భూసంస్కరణ చట్టాలు చేర్చబడ్డాయి. ఈ వివాదంలో అయిదుగురు న్యాయమూర్తులు—కనియా, పతంజలిశాస్త్రి, ముఖర్జీయా, దాస్, చంద్రశేఖర అయ్యర్‌లు—ఇరవైభాగంలోగల అధికారం సార్వభౌమాధికారమనీ, కాబట్టి 13వ అనుచ్ఛేదానికి లోబడి ఉండవలసిన పనిలేదనీ నిర్ణయించారు.

తిరిగి ఇలాంటి వివాదమే 1965లో సజ్జన్‌సింగు వ్యవహారంలో సుప్రీంకోర్టు ముందుకొచ్చింది. 1964 జూన్‌లో వచ్చిన 17వ సంస్కరణ ఫలితంగా ఈ వివాద మొచ్చింది. 9వ షెడ్యూలులోని భూసంస్కరణల చట్టాలసంఖ్య 64 కు పెరిగింది. 31ఎ కూడా సంస్కరింపబడింది. కాని ఇప్పుడు అభిప్రాయాలు పూర్తిగా భేదించాయి. 3:2 అయింది. గజేంద్రగడ్కర్, రఘుబీర్ దయాళ్, వాంఛూలు ఒక అభిప్రాయాన్ని వెల్లడిస్తే, మధోల్కర్, హిదయతుల్లాలు, వేరువేరు తీర్పులలో తమ అసమ్మతిని వ్యక్తం చేశారు. ప్రాథమికహక్కులు నిజంగా ప్రాథమికమైనవి హక్కులు కావని చెప్పేటందుకు వారంగీకరించలేదు.

కాబట్టే గోలక్‌నాథ్‌వివాదంలో, పైనచెప్పిన సజ్జన్‌సింగ్‌లోని మెజారిటీ మైనారిటీతీర్పుల సమస్యను పరిష్కరించటమే ముఖ్యోద్దేశ్యమని శ్రీ సుబ్బారావన్నారు. సుబ్బారావు, షా, సిక్రీ, షెలాట్, వైద్యలింగాలు ఒక తీర్పునిస్తే, వారితో ఏకీభవిస్తూ హిదయతుల్లా వేరేతీర్పునిచ్చాడు. వాంఛూ, భార్గవా, మిత్తర్‌లు ఒక తీర్పు, బచావత్ ఒకతీర్పు, రామస్వామి ఒకతీర్పు ఇచ్చారు—అయితే ఈ ఐదుగురి అభిప్రాయాలు ఒకవిధంగా ఉన్నాయి.

సుబ్బారావుతీర్పు ఈవిధంగాఉంది: పార్లమెంటుకు రాజ్యాంగాన్ని సవరించే అధికారముంది. కాని అది 368వ అనుచ్ఛేదంలో లేదు. ఆ అధికారం 245, 246, 248 లలో ఉంది. 368లో ఉంది కేవలం అనుసరించవలసిన పద్ధతి మాత్రమే. ఈ సవరణలు కూడా 13వ అనుచ్ఛేదంలో వర్ణించినట్లు 'లా' యే అవుతుంది. కాబట్టి ఎలాంటి సవరణకూడా ప్రాథమిక హక్కులకు భంగకరంగా ఉండగూడదు. ప్రాథమికహక్కుల సవరణ రాజ్యాంగసవరణాధికార పరిధిలో లేదు. అయితే ఇంతవరకు జరిగిన 1, 4, 17వ సవరణలు రాజ్యాంగబద్ధాలే. ఇక ముందునుంచి అలా జరగకూడదు. పార్లమెంటుకు ప్రాథమిక హక్కులను సవరించే అధికారమెంతమాత్రమూ లేదు. దీనికిగాను అమెరికను న్యాయశాస్త్రంనుంచి 'డాక్ట్రిన్ ఆఫ్ ప్రాస్పెక్టివ్ ఓవరు రూలింగ్' సిద్ధాంతాన్ని ఆశ్రయించారు. హిదయతుల్లా ప్రాథమిక హక్కులను సవరించాలంటే రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పరచాలనీ, చాలారోజులు రాజ్యాంగసవరణలను కాదనలేదు కాబట్టి గతంలోని సవరణలు రాజ్యాంగబద్ధాలే. ఇకనుంచి పార్లమెంటుకు ప్రాథమిక హక్కులను సవరించే అధికారం లేదన్నారు. వెంటనే నవంబరు 1971లో 24వ సవరణద్వారా 13, 368వ అనుచ్ఛేదాలు సవరింపబడ్డాయి.

తిరిగి 1973లో కేశవానందభారతి వివాదంలో ఈ సమస్యలు తలఎత్తాయి. దీనిలో పై 24 మరియు 25, 29వ సవరణలు న్యాయస్థానం ముందుకొచ్చాయి. ఈ వివాదం భారతరాజ్యాంగ చరిత్రలోనే చిరస్మరణీయమైనది. ఆరు నెలలపాటు 1972 నవంబరు నుంచి 1973 ఏప్రిల్‌దాకా వాదనలుసాగి, 1973 ఏప్రిల్

24వ తీర్పువచ్చింది. పదముగ్గురు న్యాయమూర్తులు దీనిని విని తీర్పులు ఇచ్చారు.

ఇంకో విషయాన్నికూడా ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి. గోలక్‌నాథ్ వివాదంలో కోర్టుముందు కొచ్చిన సమస్య చాలాపరిమిత పరిధిలోనిది. అది 13 (2), 368 అనుచ్ఛేదాలకు సంబంధించినదే. పార్లమెంటుకు రాజ్యాంగ స్వరూపాన్నే మార్చే హక్కులేదనీ, ప్రాథమిక హక్కులనుమార్చే హక్కేలేదనీ వాదనసాగిస్తే, ఈ వాదనలో తగినంత బలముందనీ, కాని ఇప్పుడు ఆ ప్రశ్న వారిముందులేదనీ, ఒకవేళ పార్లమెంటుగనుక మూడవభాగంలో కాకుండా మిగతా భాగాలలోఉన్న రాజ్యాంగ మౌలికస్వరూపాన్ని మార్చ ప్రయత్నిస్తే అప్పుడు చూడవచ్చు అని అన్నారు సుబ్బారావు.

కాబట్టి కేశవానందభారతిలో, రాజ్యాంగంలోని మిగతా అనుచ్ఛేదాలను, అవిమౌలికమైనవయితే, మార్చవచ్చునా లేదా అన్న ప్రశ్న సుప్రీంకోర్టు ముందుకొచ్చింది. గోలక్‌నాథ్‌లో కేవలం ప్రాథమిక హక్కుల సవరణ సమస్య అయితే, ఇప్పుడు ఏ సవరణ అయినాసరే, అదిగనుక మౌలిక స్వరూపాన్ని మార్చేదయితే—అన్న రూపాన్ని దాల్చింది.

ఆరుగురు న్యాయమూర్తులు, సిక్రీ, షెలాట్, హెగ్డే, గ్రోవర్, జగన్మోహనరెడ్డి, ముఖర్జియాలు ఈవిధంగానిర్ణయించారు: పార్లమెంటుయొక్క రాజ్యాంగ సవరణాధికారము పరిమితమైనది. రాజ్యాంగమౌలిక స్వరూపాన్నే మార్చేటంత అధికారం పార్లమెంటుకు లేదు. 368వ అనుచ్ఛేదము ఈ మౌలిక స్వరూపాన్ని (బేసిక్ స్ట్రక్చర్)ను మార్చే అధికారమివ్వదు. కొత్తగా చేర్చబడిన 31సి అనుచ్ఛేదం సరియైన చట్టముకాదు. గోలక్‌నాథ్ తీర్పు సరియైనది కాదు.

ఏడవ న్యాయమూర్తి ఖన్నాకూడా, వీరితో ముఖ్యమైన నిర్ణయం, పార్లమెంటుకు అధికారంలేదు అన్నవిషయంలో ఏకీభవించాడు. 31సి అనుచ్ఛేదంలో ఎక్కువభాగం సరియైనదే, ఎందువల్లనంటే అది మౌలిక స్వరూపాన్ని మార్చదు కాబట్టి. కోర్టుల అధికారం చెల్లదన్నభాగం చెల్లదు.

ఈవిధంగా ఏడుగురు న్యాయమూర్తులు పార్లమెంటుకు పరిమితమైన అధికారాలనే ఇచ్చారు. మౌలికస్వరూప సిద్ధాంతాన్ని బలపరిచారు.

మిగతా ఆరుగురు న్యాయమూర్తులు రే, పాలేకర్, మాథ్యూ, బేగ్, ద్వివేదీ, చంద్రచూడ్‌లు పార్లమెంటు అధికారానికి పరిమితి లేదన్నారు.

ఇది ఈనాటి న్యాయము, చట్టము. దీనిని గురించి వచ్చే మార్పులు, చేర్పులపట్ల సుప్రీంకోర్టు ఏమంటుందో వేచి చూడవలసిన విషయము.

ఈవిధంగా 1965లో హిదయతుల్లా, ముధోల్కర్‌ల తీర్పులతో ప్రారంభమైన ఒక ధోరణి, 1967లో సుబ్బారావు చేతులలో అధిక సంఖ్యాకుల తీర్పుగా మారి, 1973లో రాజ్యాంగానికొక మౌలిక స్వరూపముంది, దాని నెవ్వరూ మార్చలేరు అనేటంత వరకొచ్చింది.

ఈ వ్యాసం ఆశయము శ్రీ సుబ్బారావు ధోరణిని వివరించటం కాబట్టి ఇంకా కొంచెం ముందుకుపోయి ఈ ధోరణి వెనుకగల ఆలోచనను పరిశీలిద్దాం.

ఈ రాజ్యాంగ యుద్ధాలకు కారణమైన 368 అనుచ్ఛేదమేమిటి? దాని ప్రకారం 2/3వ వంతు మెజారిటీతో రాజ్యాంగాన్ని సవరించవచ్చు. కాని కొన్ని అనుచ్ఛేదాలను గాని, భాగాలనుగాని సవరించవలసివస్తే ఉదాహరణకు 54, 55, 73, అయిదు ఆరు భాగాలు, ఏడవ షెడ్యూలులోని జాబితాలు- దేశంలోని రాష్ట్రాలలో సగం రాష్ట్రాలు కూడా ఆ సవరణలను ఆమోదించాలి.

ఈ అనుచ్ఛేదంలో మూడవ భాగమైన ప్రాథమికహక్కులు ఉదహరింపబడలేదు.

1965లో హిదయతుల్లా, ప్రాథమిక హక్కులంటూ ఒక భాగాన్నే ప్రత్యేకించినపుడు అవి కేవలం 2/3వ వంతు మెజారిటీ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడ్డవంటే నమ్మటం కష్టమంటాడు. అదే సజ్జనసింగ్ తీర్పులో, ముధోల్కర్, 368వ అనుచ్ఛేదం కేవలం ఏ పద్ధతిద్వారా రాజ్యాంగం సవరింపబడాలో సూచిస్తుంది కాని వేరు కాదనీ, పైగా సవరణపేరుతో రాజ్యాంగస్వరూపాన్నే మార్చివేయటం, తిరిగి వ్రాసినంతపని చేయటం పనికిరాదనీ, అంటాడు. ఉదాహరణకు 'సావరిన్ డెమొక్రాటిక్ రిపబ్లిక్' అని ఉన్నంతకాలం, నాటి లక్షణాలను తీసివేసేటట్లు సవరణలు చేయవచ్చా అని ప్రశ్నించాడు.

1967లో హిదయతుల్లా గోలక్‌నాథ్ కేసులో దీనిని ఇంకా వివరించాడు. 12వ అనుచ్ఛేదంలో "స్టేట్" అంటే ప్రభుత్వము (కేంద్ర రాష్ట్ర) పార్లమెంటు, రాష్ట్రాలలోని సభలూ అన్నీఅని నిర్వచించి, 13లో ఆ 'స్టేట్' ప్రాథమికహక్కులకు భంగకరంగా ఏ చట్టమూ చేయగూడదన్నారంటే, ప్రాథమికహక్కులు 'స్టేట్' తీసివేయటానికి వీలులేనివన్నాడు. 368వ అనుచ్ఛేదం ప్రకారం పార్లమెంటుకు విస్తృతాధికారాలున్నాయని నిర్ణయిస్తే [illegible]

వేయవచ్చనే వాదము 'భయోత్పాత జనితవాదము' అనీ, అంతవరకొస్తే దానికి విరుగుడు న్యాయస్థానాల్లో లేదనీ, పార్లమెంటు సభ్యుల నెన్నుకునే ప్రజలలో ఉందనీ, వాంఛూ ఈ గోలక్‌నాథ్ కేసులోనే అన్నాడు.

బహుశా దానిని మనస్సులో పెట్టుకునే కాబోలు, హెగ్డే ముఖర్జీ, ఇవి భయోత్పాద జనితవాదాలు కావనీ, ఉన్న ప్రశ్నల్లా 368 అనుచ్ఛేదాన్ని గురించేనన్నాడు. ఉదాహరణకు తన 2/3వ వంతు మెజారిటీ పోకముందే, ఏ సవరణైనా 368 అనుచ్ఛేదాన్నే, స్వల్ప మెజారిటీతో సవరణలు చేసి ఆ విధంగా మార్చగూడదా అంటాడు. 'స్టేట్' (రాజ్యం), 'గవర్నమెంటు' (ప్రభుత్వము) విభిన్న వ్యవస్థలనీ, రెండిటికీ భేదముందనీ, 'కాన్‌స్టిట్యూషనల్ లా' (రాజ్యాంగ న్యాయశాస్త్రము) అనేది రాజ్యము తనంతట తాను తన మీద విధించుకునే ఆంక్ష అనీ, ఇది తన మంచికోసమే విధించుకుంటుందనీ, దానిని కాదనగూడదంటాడు. మన రాజ్యాంగంలో, ఈ రాజ్యాంగ సంబంధమైన చట్టాలకు సామాన్య చట్టాలకూ దాదాపుగా భేదంలేదని అంటాడు. ఈ నిబంధనే లేకపోతే "లెజిస్లేటివ్ డిక్టేటర్ షిప్" (శాసనసభా నియంతృత్వము)కు అడ్డేమి ఉంటుందంటాడు.

"Parliament today is not the constituent body as the constituent Assembly was, but is a constitued body which unst bear true allegiance to the constitution as by law established" అంటాడు.

ఇదే ధోరణి ఇంకా స్పష్టంగా 1973 కేశవానందభారతిలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి సిక్రీ తీర్పులో కనపడుతుంది. అయన ఒక చక్కని ఉదాహరణ ఇచ్చాడు. 368వ అనుచ్ఛేదంలో, ఏ ఏ మార్పులకు 2/3వ వంతు మెజారిటీ కావాలి, ఏ ఏ మార్పులకు రాష్ట్రాలలో సగం రాష్ట్రాలు సమ్మతించాలి వగైరా వివరింపబడింది. అందులో 54, 55 అనుచ్ఛేదాలున్నాయి. ఈ రెండూ కేవలం రాష్ట్రపతి ఎన్నికకు సంబంధించినవి, సగం రాష్ట్రాల అనుమతి కావలసినవి కాని ఇందులో 52 ఉదహరింపబడలేదు. 52 అనుచ్ఛేదం ప్రకారమే ఈదేశానికొక రాష్ట్రపతి అంటూ ఉంటున్నది. కాబట్టి కేవలం 2/3వ వంతు మెజారిటీ, ఈదేశానికి రాష్ట్రపతివద్దు ఫలానారాజు కావాలి, లేదా ఫలానా వంశస్థులే పరిపాలించాలి అంటే సరియైనదేనా? సరియైనదే అవాలి. ఎందుకంటే. ఈ మార్పుకు సగం రాష్ట్రాల నిర్ణయాలు అవసరంలేదు, దీని మార్పేదయినా పార్లమెంటుకు విస్తృతాధికారాలున్నాయి. అలాగే 368 లో, 368 ఉదహరింపబడలేదు. హెగ్డేముఖర్జీ చెప్పినట్లు, 2/3వ వంతు కూర్చుని ఇకనుంచి రాజ్యాంగసవరణలకు 2/3వ వంతు అవసరంలేదు, సామాన్య మెజారిటీచాలు అంటే సరిపోతుందా? అలాగే 1వ అనుచ్ఛేదం – ఇండియా అంటే భారతదేశం రాష్ట్రాల సముదాయమంటుంది, అలాకాకుండా, 368 లో 1వ అనుచ్ఛేదం ఉదహరింపబడలేదు కాబట్టి, రాష్ట్రాలను ఏకాఏకి రద్దుచేయవచ్చా?

పార్లమెంటుకు విస్తృతాధికారాలు లేవు అనుకుంటేతప్ప, ఈ విపర్యయాలకు ఆస్కారం లేకుండాపోదు, మౌలిక స్వరూపం ఒకటి ఉంది అని అనుకోకపోతే లాభంలేదు. ఎప్పుడుఏది జరిగినా జరగవచ్చు, అన్నీ రాజ్యాంగ బద్ధాలే.

కాబట్టే సిక్రీ రాజ్యాంగంలోని ప్రతి అనుచ్ఛేదము సవరింపబడవచ్చు, కాని దాని ఫలితంగా రాజ్యాంగం మౌలికస్వరూపం మారగూడదంటూ, అయిదు విషయాలను మౌలిక స్వరూపాలుగా పేర్కొన్నాడు. అవి ఇవి: రాజ్యాంగంయొక్క సర్వాధిక్యత, ప్రజాస్వామిక, రిపబ్లికన్ స్వరూపాలతోకూడిన ప్రభుత్వము, రాజ్యాంగంయొక్క మతనిరపేక్షత్వ ధోరణి, పరిపాలనాశాఖ, న్యాయశాఖ, శాసనశాఖలకుగల అధికారాల విభజన, రాజ్యాంగంయొక్క ఫెడరల్ స్వభావం. మిగతా అభిప్రాయాలను వ్యాసవిస్తరణ భీతితో ఇక్కడ ఈయటం లేదు.

ఈవిధంగా రాజ్యాంగం ఏర్పడిన 23 సంవత్సరాలను, 1973 లో మన రాజ్యాంగ జీవితనౌక ఒక రేవును చేరుకుంది. ఇప్పుడు ఆరేవుసుదాటి ముందుకు పయనించబోతున్నది. ఇక ప్రవాహం ఎటుపోతుందో, దాని ఫలితాలెలా ఉంటాయో వేచి చూడాలి.

కాబట్టే శ్రీ సుబ్బారావు తన 'కారవాన్' పత్రికలోని వ్యాసాన్ని ఈవిధంగా ముగించాడు: "Be that as it may, the ramifications of the Concept of 'basic structure' remain to be unfuled and expanded by the Supreme Court in future cases. It is hoped that the Supreme Court will liberally construe the said concept to salvage the freedoms of the people."

*　　　*　　　*

అయితే ఏమిటీ ధోరణులు, ఈ తికమకలెందుకని సామాన్యునికి సందేహం రావచ్చు. సమాజం మార్పుచెందుతున్నది, న్యాయశాస్త్రంకూడా సజీవమైనదిగా ఉండాలంటే అదీ మార్పుచెందాలి. అయితే అసలీ న్యాయశాస్త్రానికి జీవం ఏమిటి? స్పష్టంగా తెలియబడేది, రాజ్యంచేత చేయబడేదీ, సమాజానికి పనికివచ్చేది ఏదయితే అవుతుందో అదే 'లా'. దీనికి చట్టాలు, గతంనుంచీ వస్తున్న ధోరణులు, సమాజంలోఉన్న ఆచారాలు ఆధారాలు. ఈవిధంగా వచ్చే

'లా' కు మంచి చెడు, నైతికత అనేవి లేవు. దీనిలోఉన్న సుగుణ మల్లా సుస్పష్టత, నిర్దిష్టత. ఇది ఒక సిద్ధాంతం. ఇక రెండవ సిద్ధాంతం: 'లా' అంటే కేవలం చట్టాలు, సూత్రాలే కాకుండా తప్పక ఒక నైతిక ఉండితీరాలి. కేవలం సూత్రాలే రాజ్యమేలగూడదు. ఇంకో మూడవసిద్ధాంతముంది. నైతికత అనేది చట్టాలుచేసే వారిలో, వారితోఉండాలి. న్యాయమూర్తులవనల్లా చట్టం ఎలా ఉందో దానిని విడమరిచి చెప్పటం, అంతే కాని వాటిని ఎలాఉండాలి అనే గీటురాయిమీద వ్యాఖ్యానించడం కాదు. న్యాయమూర్తుల నైతికతమీద ఆధారపడటమంటే ప్రజాప్రతినిధులు కానివారిమీద ఆధారపడటం. అయితే దీనికొక సమాధానమిచ్చారు: పౌరునికీ పౌరునికీమధ్య, పౌరునికీ రాష్ట్రానికీమధ్య, రాష్ట్రాలకు రాష్ట్రాలకూ మధ్య, రాష్ట్రాలకు కేంద్రానికీ మధ్యవచ్చే వివాదాలలో ఒక నిష్పక్షపాతి మధ్యవర్తిగా వ్యవహరించాలి. దీనికిగాను వాళ్ళ శిక్షణరీత్యా, సంప్రదాయాల రీత్యా న్యాయ మూర్తులే తగినవారని చెప్పారు. పైగా న్యాయమూర్తులు చలాయించే అధికారం తమకోసంకాదు, ప్రజలతరఫున చలాయిస్తున్నారు.

కాబట్టే సుప్రీంకోర్టు న్యాయమూర్తి కృష్ణయ్యర్ ఒక గ్రంథంలో ఇలా అంటాడు: "ఎంతకాలమయితే "మేము, భారత పౌరులం" తమ తరఫున న్యాయసంబంధమైన అధికారాలు చలాయించమని న్యాయస్థానాలను నియమించారో, అంతవరకు న్యాయస్థానాలు ప్రజల తరఫున ఆ అధికారాలను చలాయిస్తాయి." అయితే శాసనాలను చేసేవారు చట్టాన్ని నిర్మిస్తే, న్యాయస్థానాలు ఆచట్టం ఎలాఉండి ఉండాలో నిర్ణయిస్తాయి.

1976 జూన్ ఆల్ఇండియా రిపోర్టర్ పత్రికలోని ఒక వ్యాసంలో, వ్యాసకర్త అనిరుద్ధ ప్రసాద్‌సింగ్ పై విషయాలన్నిటినీ ప్రస్తావించి, దీనిని "as it is" "as it ought to be" ల మధ్య ఘర్షణగా వర్ణించాడు. రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించటం, న్యాయస్థానాలు ఆటోటివి సిద్ధాంతంమీద చేస్తూ, చట్టాలను అసలు చేయటం మట్టుకు ఆటోక్‌గా చేస్తాయనీ — అందువల్ల ఈ తికమక అంటాడు.

కేశవానంద భారతి వివాదంలో, పార్లమెంటుకు రాజ్యాంగ సంస్కరణకుగల అధికారాల్ని నిర్ణయంలో, సుప్రీంకోర్టు రెండు సిద్ధాంతాలను సమన్వయపరచ ప్రయత్నించిందనీ, 368 వ అనుచ్ఛేదాన్ని ఉన్నదున్నట్లుగా వ్యాఖ్యానిస్తూ పార్లమెంటుకు రాజ్యాంగాన్ని సవరించే హక్కుందని నిర్ణయిస్తూ, ఎలాఉండాలి అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకుని మౌలిక స్వరూపాన్ని మార్చే హక్కు లేదని నిర్ణయించిందంటాడు ఆవ్యాసకర్త.

భారతదేశం బోటిదానికి ఈ సమన్వయ సిద్ధాంతం చాలా అవసరమనీ, ప్రజాస్వామిక దేశానికి అధికార విభజన, ఒండొరుల మీద పరిమితులు కావాలంటాడు. మన దేశంలోని ఈ మధ్యకాలం నాటి రాజ్యాంగసంస్కరణలను గురించి ఈవిధంగా వ్యాఖ్యానిస్తాడు: మనదేశంలో శాసనాలు చేయటం అనేది 'మొక్కుబడి' (టోకెనిజమ్) వ్యవహారంగా తయారయింది. ఉదాహరణకు అమెరికన్ రాజ్యాంగం 1787 నుంచి 1967 దాకా కేవలం 25 సార్లే సవరింపబడింది. మనరాజ్యాంగం 1950 నుంచి 75 దాకా 39 సార్లు సవరింపబడింది. 1966 లో మూడుసార్లు సవరింపబడింది. 1975 లో— 4 రాజ్యాంగ సవరణలు, 29 ఆర్డినెన్సులు, 52 కేంద్రప్రభుత్వ చట్టాలు వచ్చాయి. ఇందులో 222 వ అనుచ్ఛేదము, హైకోర్టు న్యాయమూర్తులను ఒక చోటునుంచి వేరొక చోటుకు బదిలీచేస్తే కొంతపరిహారమివ్వాలనేది, 1956 లో 7వ సంస్కరణచట్టంద్వారా పరిహరింపబడి, తిరిగి 1963 లో 15వ సవరణ చట్టంద్వారా ప్రవేశపెట్టబడింది.

స్పష్టంగా చెప్పుకోవాలంటే, నేటి రాజ్యాంగ సవరణల వెనుక గల ధోరణులలో, పార్లమెంటుకు విశేషాధికారాలులేవు. దాని అధికారాలు పరిమితమైనవే అనే అభిప్రాయాల చరిత్ర ఇది.

**"—It is in the courts and not in the legislatures that our citizens primarily feel the keen, cutting edge of the law. If they have respect for the work of the Courts, their respect for law will survive the short-comings of every other branch of government, but if they lose their respect for the work of the courts, their respect for law and order will vanish with it to the great detriment of society"**

**Justice Arthur T. Vanderbilt in**

**"The challenge of Law Refrom" pages 4—5**

—

# నిరీక్షణ

కేఎస్వీ

అలలుగా తెరలు తెరలుగా వెలుతురు పొరలుగా
ప్రతిధ్వనిస్తోంది నీ నవ్వు
ఈశాన్య మందిరంలో
ఈ సుప్త నందనంలో

కోయిల్ల కాలం పోయింది
కుసుమాల కాలం పోయింది
గుండెతలుపుల్ని మంత్ర స్పర్శతో తెరిచి
ఝుమ్మని సునాద లతాంతాలు విరియించిన నీ స్మృతిమాత్రం మిగిలింది

నడినిసి గడియల పులకరించే మేనుతో ఎదురుచూస్తుంది బాట
స్వప్నలోకాల స్వర్ణ ఘంటికల్ని మ్రోయించే నీ కాలి అందెల రవళి కోసం
రావు నువ్వు రావు జన్మపరంపరలు గడచినా
ఎన్ని విత్తులలోంచి ఎన్ని మొక్కలో మొలిచి
మ్రాకులైనా
నువ్వు రానేరావు

దిక్కు దిక్కునా నా చూపులు బారులు బారులుగా
చుక్క చుక్కలో నా గుండెల శబ్దం మెరుపులు మెరుపులుగా
ప్రతి సాగర కెరటం నా చాచిన బాహువుగా
నీకై నిర్నిద్రంగా
ఎదురు చూస్తూనే ఉంటాను నేను
శిశిరం స్పృశించలేని జీవశక్తినై
మృత్యువు వరించలేని ప్రాణశక్తినై.



# చదువని వాడజ్ఞుండగు...

చదువు చదువు చదువు

అదే కల్పతరువు

పసిపాపలకు, బోసినోటి తాతలకు ఏ వయస్సు వారికైనా

చదువుల తల్లి స్వాగతమిస్తుంది. ఈ రోజుల్లో

మనిషి వ్యక్తిత్వాన్ని సమాజానికి ఉపయోగించే విధంగా తీర్చిదిద్దేది విద్య.

ప్రాథమిక విద్య నిర్బంధం చేశారు...ఉచితంగా నేర్పుతున్నారు.

మెట్రిక్ పూర్వం, మెట్రిక్ తర్వాత దశలలో వెనుకబడ్డ కులాల విద్యార్థులకు

ఉపకార వేతనాలిస్తారు.

ఉచిత వసతి, భోజన సౌకర్యాలున్నాయి.

కోటి పైగా పాఠ్యపుస్తకాలు ముద్రించి, వాటిని స్టేషనరీ పరికరాల్తోపాటు

కంట్రోలు ధరలకు అందిస్తున్నారు.

దేశమంతటా డెబ్భై వేలకు పైగా పుస్తకాల బ్యాంకులు తెరిచారు.

హరిజనులు, గిరిజనులు, తదితర బలహీన వర్గాలకు రాష్ట్ర ప్రభుత్వం

అనేక విద్యా సౌకర్యాలు కల్పించింది.

విద్యా ప్రమాణాలు పడిపోకుండా రాష్ట్రప్రభుత్వం 12 సూత్రాల పథకాన్ని

రూపొందించింది.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఇరవై సూత్రాల పథకం పుణ్యమా అని

ఇప్పుడు పాఠశాలల్లో, కళాశాలల్లో క్రమశిక్షణ వాతావరణం ఏర్పడింది.

విద్య అనే కల్పతరువును ప్రతియింట్లో పెరటి చెట్టుగా నాటుకుందాం.

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

(6/76/తెలుగు)

# వెఱ్ఱి వెంకన్న

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రీ రమానాథ విష్ణ్వవతార! ఆర్తి
హరణ! వేంకటరమణ! దయాపయోధి!
తెలియకడుగుదు నిన్నుఁ బ్రశ్నలను కొన్ని
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

నాకుఁ గల్గినయట్టులు నీకుఁ గూడ
దేహమున్నదా? అది ధాతిదేహమా? వి
వాహమైనదా? సంతానభాగ్య మెంత?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

ఏది శ్రీ కల్కి రూపము నీది? దేవ!
అందమును జిమ్ము వదనారవిందమేది?
కమల పత్ర విశాలముల్ కన్నులేవి?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు?

నీ ధనంబులు బంగారు నిధులు నీకు
'బిడ్డలము మేము' తినరాద? ప్రీతి లేద?
అమెరికా యందొ రష్యానొ అవి వ్యయంబ?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

కనులు గప్పిరి పిచ్చి భక్తప్రవరులు
నామములతోడ నీదు కనప్వ వార
లెవ్వరున్నారు? ఓర్చితివెట్లు దాని?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

కరము జ్ఞానం బనెడి దివ్యగంగఁ దెచ్చి
నిత్యభక్తిని జేసి పన్నీరు దానిఁ
గలిపి నీ కభిషేకింతు గంద మలఁది
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

సరస సుందర ఫాలదేశమున నీకుఁ
జక్కఁబెట్టెదఁ గస్తూరి చుక్కఁ దేవ!
కనులఁ బెట్టెదనింపుగ కజ్జలంబు
వెఱ్ఱి వెంకన్న యనఁ గోపింపకు ప్రభు!

స్వామి పగు నీకు పంచి ముస్తాబు చేసి
భక్తితోడఁ బద్మావతి భావముగని
నిన్నుఁజేరెద నెట్లు మన్నింతువొ కద?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

కొనవలయునా ప్రసాదంబు ధనము పెట్టి?
కాంచుటకు నిన్నుఁ గనుల 'టిక్కెట్టు' దేవ!?
భక్తి ధనవంతు సన్నిధి వచ్చి పడవ?
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

దొంగలెందఱో నీ చుట్టు దోఁచుకొన్న
దిక్కు మక్కును లేద? నీ దివ్యధనము
దోఁచుకొను దొంగ కాడును దొరను కాను
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

కల్లకపటము లే కాని ఉల్లమిచ్చు
భక్తుఁడొకఁడైన నున్నాఁడె? వానికేల
ఏడుకొండల నెక్క నీవేఁగి ప్రోచు
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

తెలుఁగులో అలంకారముల్ కలవు చాల
నిన్నుఁ బ్రీతుని జేయుంగఁ బల్కి యట్లు
లాడిలిన్ వ్యాజ సంస్తుతి వ్యాజనింద
వెఱ్ఱి వెంకన్న యన్నుఁ గోపింపకు ప్రభు!

# సాహిత్యంలో సృజన

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

రచనా వ్యాసంగం యావత్తూ సాహిత్యం క్రిందే వస్తుంది. కవిత్వం ఒకదాన్నే పూర్వం కళల్లో చేర్చారు. నేడు కవిత్వంతోబాటు కథ నవల, నాటకం, “సృజనాత్మక సాహిత్యం” అని పిలవబడుతున్నది అంటే కవిత్వంతోబాటు నవల, కథ, నాటకం—వీటి రచననీ కళాసృష్టిగానే భావిస్తున్నాం అంటే ఏమిటి భేదం? ఉదాహరణకు నవలలో పాత్ర పోషణ విషయం తీసుకుంటే, బాపిరాజు నవలల్లోలాగా నాయకుడు స్ఫురద్రూపి, ఆజానుబాహుడు, అతనికి సంగీతం వచ్చు కవిత్వం వ్రాస్తాడు, టెన్నిస్ పందేలలో ఎప్పుడూ మొదటి బహుమతే గెలుచుకుంటాడు—అంటూ మొదటి ప్రకరణంలోనే కథానాయకుణ్ణి వర్ణించెయ్యడం కళకాదు. మరో ఉదాహరణ: మొదటి అధ్యాయంలో మార్క్సిస్ట్‌గా ఉన్న యువకుణ్ణి ప్రవేశపెట్టి తెలుగ సినిమా హీరోలాగా అఖండమైన విజయ పరంపరతో అతణ్ణి చివరి అధ్యాయంలో కూడా చెక్కు చెదరని మార్క్సిస్ట్‌గానే ఉన్నట్లు చిత్రించడం “సృజన” అనిపించుకోదు. అంటే ఇక్కడ అతను చివరి అధ్యాయంలో మార్క్సిస్ట్‌గా ఉండగూడదనీ కాదు—ఉండలేడనీ కాదు మార్క్సిస్ట్‌గా సొంత అనుభవంతో అతనెదుర్కొన్న కష్ట నిష్ఠూరాల్నీ, దాన్నుంచి అతని దృక్పథంలో వచ్చిన వైశాల్యాన్నీ, అనుభూతి వైవిధ్యాన్నీ, మార్పుని కనువిప్పుగా చిత్రించితేనే తప్ప అంటే మొదటికీ, చివరికీ అతనిలోని పరిణామం, తద్వారా అతనిలోని మార్క్సిజం బలపడటాన్ని నిరూపిస్తే తప్ప అది పాత్ర సృష్టి కాదు.

మాటల కందని సంశ్లిష్టమైన అనుభూతిని మాటలద్వారా అందజేసే ప్రయత్నమే—సాహిత్యంలో సృజన.

కవిత్వంలో సృజన ఒక రసాత్మకమైన వాక్యంతో, ఒక పద బంధంతో, వ్యక్తం కావచ్చు. “నా తెలంగాణ కోటిరత్నాల వీణ” అన్న దాశరథి కవి వాక్కు, దాని సృజనాత్మక శక్తివల్లనే అంత ప్రచారాన్ని పొందగలిగింది. ఈ వాక్యానికి మామూలు అర్థం ఏమీలేదు. తెలంగాణా భూభాగం రత్నాలవీణ ఎలా అవుతుంది? అందులో కోటి రత్నాల వీణ అంటే అన్ని రత్నాలు పొదిగినా వీణ అనా? లేక అంత విలువైన వీణ అనా? ఇలా తర్కిస్తే, [అంటే మామూలు మాటల అర్థాలను సమన్వయించుకొని చూస్తే, ఏమీ బోధపడదు.

కానీ తెలంగాణా అనగానే ప్రజలనీ, కోటి రత్నాలు అనగానే కోటి మంది రత్నాలవంటి మనుషులు అనీ, వీణ అనగానే ఆ కోటి మంది స్వేచ్ఛకోసం ఎలుగెత్తిన కంఠ శ్రుతి అనీ బోధపరుచుకున్నప్పుడు, ఆ వీణయొక్క సంగీతం వినగలిగినప్పుడు, ఆ వాక్యంలోని సృజనాత్మకశక్తి మనస్సు తాకుతుంది. మాటల కందనిది, కానీ మాటల ద్వారానే అందినదీ అయిన ఆ శక్తి ఎటువంటిదో మనం గ్రహించవచ్చు. పూర్వులు ‘రస’మని, ‘ధ్వని’ అనీ పేర్కొన్నది ఈ సృజన శక్తినే. అయితే ఆలంకారికుల తర్జన భర్జనలలో పడి, దాని అసలు

స్వరూపం మరుగున పడిపోయింది. అంతేకాకుండా, మరొక విశేషం కూడా ఉంది. ఈ సృజనశక్తి రచయితకెంత అవసరమో పాఠకుడికీ అంత అవసరమే. కానీ, రచయితా, పాఠకుడూ ఒకరుకాదు. ఈ ఇద్దరిలోనూ సాహిత్యపరంగా ఉండవలసిన సృజనశక్తి భిన్నమైనది. అది వేరు రూపాలలో ఉంటుంది. అది ఉద్భూతమయ్యే కారణాలూ సందర్భాలూ కూడా వేరు. ఆలంకారికులు, పాఠకుడూ లేక విమర్శకుడూ కలిగి ఉండవలసిన దృష్టితోనే సాహిత్యంలో సృజనను తర్కించి, అభివర్ణించారే తప్ప, వాళ్ళు రచయిత దృక్పథం నించీ, అంటే రచయిత వ్యక్తి వైశిష్ట్యంనించీ ఉద్భూతమైన సృజనశక్తి ఎలా అభివ్యక్తమౌతున్నదో విచారించే ప్రయత్నం చెయ్యలేదు. అటువంటి ప్రయత్నానికి సూచనప్రాయంగా కొన్ని మాటలు చెప్తాను:

“తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవిచేసే అంతర్బహిర్యుద్ధారావమే కవిత్వమంటాడు చలం”. శ్రీశ్రీ కవిత్వానికి యోగ్యతా పత్రం రాస్తూ ఇంకోమాటకూడా అన్నాడు చలం— “కృష్ణశాస్త్రి తన బాధను అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు. కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ;” ‘కృష్ణపక్షం’ ద్వారా కృష్ణశాస్త్రీ, ‘మహాప్రస్థానం’ ద్వారా శ్రీశ్రీ ఆయా కవిత్వోద్యమాలకు రథసారథులు అయారంటే, ఆయా కావ్యాలలోని సృజనశక్తే అందుకు కారణం. కృష్ణశాస్త్రికి ముందూ తరవాతా ప్రేమనుగూర్చి, నిర్వేదాన్నిగూర్చీ వ్రాసిన వారున్నారు. అలాగే శ్రీశ్రీ అనుయాయులు పేదల్నిగూర్చి, బాధల్నిగూర్చి వ్రాశారు. కాని ఈ ఇద్దరిదే విశిష్టమైన స్థానం కావడానికి కారణమేమిటి ? వ్యక్తి ప్రపంచాన్ని, అంటే సమాజాన్ని, సామాజిక వ్యవస్థనీ ప్రతిఘటించి నిలబడటంలో ఉద్భూతమయ్యేశక్తి సృజనశక్తి, కాల్పనికవాది సమాజాన్ని తిరస్కరించినా, సామాజికవాది సమాజాన్ని విమర్శించి మార్చే ప్రయత్నంచేసినా, సాహిత్యంలో సృజనశక్తి రచయిత వ్యక్తిత్వం ఆలంబనగానే జీవితానుభూతిని ప్రతిబింబిస్తుంది, విమర్శిస్తుంది. క్రొత్తగా తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తుంది. రచయితలో ఆవ్యక్తిత్వం లేకపోతే సృజనశక్తి లేదు, కవిత్వమూలేదు. సామాజిక చైతన్యంలో మార్పువచ్చినప్పుడు, సాహిత్యంలో అది ప్రతిఫలించేందుకు, ఆ చారిత్రాత్మక తరుణంలో వ్యక్తిగా రచయిత పడుతున్న ఆవేదనా, పొందుతున్న అనుభూతి, ఒక సృజనాత్మక రచనగా అభివ్యక్తమైనపుడు సమాజం అతణ్ణి ఒక సాహిత్యోద్యమానికి రథసారథిగా నిలబెడుతుంది. సాహిత్యంలో కాలక్రమంలో క్రొత్తదనం ఎలాగూ వస్తుంది. కానీ, ఏ తరుణంలో ఏ ఫలానా రచయిత మెడలో ఆ పూలమాల పడుతుందో చెప్పడం కష్టం. “Many are called but few are chosen” అని ఒక సామాన్యోక్తి, సాహిత్యోద్యమంలో, “Even among the chosen few, only one will be the leader.” వ్యక్తి చైతన్యానికీ, సామాజిక చైతన్యానికీగల ఈ సంబంధం గుర్తించినపుడు ఒకసారి ఒక ఉద్యమానికి నాయకత్వం లభించిందని, మరోసారి మరో ఉద్యమానికికూడా నాయకత్వం వహించే ప్రయత్నంచేసే ముసలి పెళ్ళికొడుకులను ఏమనాలి? అది రాజకీయాల్లో సాధ్యమేమోగానీ, సాహిత్య సృజనలోకాదు!

నవలలు చదివి నవలలు వ్రాసేవాళ్ళు, సినిమాలుచూసి కథలు వ్రాసేవాళ్ళూ, కవిత్వాన్ని చదివి కవిత్వం వ్రాసేవాళ్ళూ సాహిత్య స్రష్టలు కాలేరు. అంటే చదవకూడదనికాదు. మొదట్లో రచన అనేది అలానే ప్రారంభం అవుతుంది. షేక్స్పియర్‌కూడా పాత నాటకాలను అనుకరించాడు. ఆర్. ఎల్. స్టీవెన్సన్ ఆంగ్లంలో వచన శైలికి పేరు పడ్డ రచయిత. ‘To pay the sedulous ape”, అంటూ తన రచన అనుకరణతో ఎలా ప్రారంభమైందీ చెబుతాడు. కీట్స్ తన కవితా సాధనలో మిల్టన్, షేక్స్పియర్ కవుల ప్రభావం నించి బయటపడి, కవిగా తనదైన ఓ రీతిని సాధించుకోడానికి ఎంత ప్రయత్నం చేశాడో అతని లేఖల ద్వారా మనకు తెలుస్తుంది. ఒక కవిగానీ, రచయితగానీ, పూర్వ రచయితల ప్రభావంనుంచీ, ప్రతిభావంతులైన సమకాలీకుల ఛాయలనుంచీ, తన్ను తాను రక్షించుకొని తనదైన వ్యక్తిత్వపు ముద్రను— భాషమీదా, ప్రక్రియమీదా, శిల్పంమీదా చూపగలిగితే తప్ప అతని రచనలోని సృజన శక్తి నిరూపణ కాదు. ఇక్కడ, రచయిత ప్రగాఢమైన అనుభూతి, భావనా తీవ్రత, చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి, అతనికి అండగా ఉంటాయి. అండగా ఉంటాయేతప్ప సృజనశక్తి లోపించినప్పుడు అవిమాత్రమే సాహిత్యానికి అక్కరకు రావు. అప్పుడు ఆ వ్యక్తి శిష్టుడూ, విశిష్టుడూ కావచ్చు కాని సాహిత్య స్రష్ట కాలేడు. మొదట్లో సృజనశక్తిఉండి తర్వాత వ్యక్తిలో పై చెప్పిన లక్షణాలు లోపించేకొద్దీ, రచనలో సృజనకూడా లోపించి, వ్యర్థమైపోతుంది. ఇది ఒక రకమైన శైథిల్యం. అంటే కేవలం మాటల గారడీ పనిచేయదు. సాహిత్యంలో సృజనకు వ్యక్తిలో నిత్యనూతనత్వం అవసరం. ఇదే సాహిత్యంలో నవ నవోన్మేషిత్వం.

# శ్రీకృష్ణదేవరాయలు: రాజనీతి; గిరిజనప్రాంత పరిపాలన

శ్రీ రాపాక ప్రకాశరావు

ఆముక్తమాల్యదను పరిచయంచేస్తూ శ్రీ ఎం. వి. ఎల్. నరసింహారావుగారు (ప్రచురణ - 1974, కావ్యపరిచయం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ) "ఆంధ్ర పంచ కావ్యాలలో ఆముక్తమాల్యదకు ఒక విశిష్టత ఉంది... కృష్ణరాయనిది సునిశితమైన దృష్టి... రాయల వర్ణనలో సామాన్యమైన విషయాలు, సామాన్యజనుల జీవితాలలో కనబడే చిన్నచిన్న సంగతులు చోటుచేసుకుంటాయి"...సాహిత్య ప్రియులకు కనిపించే విషయాలు యివిమాత్రమే. కాని లోతుగా యీ గ్రంథాన్ని పరిశీలిస్తే ఏ కావ్యములో కనిపించని ఒక ముఖ్య విషయము కనిపిస్తుంది. అదే ఆటవిక జాతుల మనస్తత్వ పరిశీలన, గిరిజన ప్రాంత పరిపాలన. భాషాకోవిదులు యీ విషయమును గమనించినట్లు కనిపించదు. వారు యీ విషయమై అంతశ్రద్ధ చూపించినట్లుగాని, ఆ పద్యములకేమాత్రము ప్రాముఖ్యత నిచ్చినట్లుగాని గనిపించదు. "ఆముక్తమాల్యద"లోని చతుర్థాశ్వాసములో యామునాచార్యుని కథలో శ్రీరామమిశ్రుడు ఆతనికి "మీ పెద్దలు మీకోసం జాగ్రత్తపరచిన నిక్షేపం శ్రీరంగనాథుని పాదపద్మాలే" అని చూపగానే యామునాచార్యుడి భ్రమతొలగిపోయి, కుమారుడికి రాజనీతి ఉపదేశించే ఘట్టములో యీ పద్యములు కానవగును. యామునాచార్యులు తన కుమారుని కుపదేశించిన రాజనీతి శ్రీరాయల రాజనీతియే."

దేశ ఆర్థికస్థితిని పెంపొందించుటకుగాను ఏమి చేయవలయునో రాయలు యీ ఆశ్వాసములోని 236 వ పద్యములో తెలిపినారు.

తే॥ దేశ వైశాల్యమర్థసిద్ధికిని మూల
మల్ప మొకింతయైన, గుంటకాల్వలు రచించి
నయము పేదకునరిగోరు నమనొసంగి,
ప్రజల పోషింప నర్థ ధర్మములు పెరుగు.

యివి 206, 221 నుండి 226 వరకు మరియు 236 వ పద్యములు నృతత్త్వ శాస్త్రజ్ఞులకెంతో ఉపకరించే పద్యములు. నృతత్త్వ శాస్త్రమునకు సంబంధించిన విషయమును భారతదేశ రాజనీతి రచనా యితిహాసములో ప్రథమముగా ప్రవేశపెట్టినది శ్రీకృష్ణదేవరాయలనియే తోచుచున్నది. వారికంటె ముందు ఎంతో మంది రాజకీయ ధురంధరులున్నా గిరిజన మనఃప్రవృత్తిని పరిశీలించి గిరిజన ప్రాంత పరిపాలన ఎవరికి హస్తగతము చేయవలయునన్న విషయమును, గిరిజన ప్రాంతములందు అడవుల ప్రాముఖ్యతను గుర్తించిన వారు గాని లేరు. రాజనీతి ధురంధరుడైన చాణక్యుడు తన "అర్థశాస్త్ర" మందుగాని, యితర రాజనీతి శాస్త్రములైన "శుక్రనీతి", "బృహస్పతి నీతి" వంటి గ్రంథములలోగాని యీ విషయము ప్రస్తావింపబడలేదు. తన సామ్రాజ్యములో "సంక్షేమ" సిద్ధాంతాన్ని చరిత్రలో మొదటిసారిగా ప్రవేశపెట్టిన అశోక చక్రవర్తిగూడా గిరిజన ప్రాంత పరిపాలన గురించి ఏ శాసనమైనా చేసినట్లు గనపడదు. "అరణ్య ప్రాంతములు గిరిజనులకెంతో ఉపయోగకరమైనవి, వాటిని నష్టపరుచరాదు" అని మాత్రము ఒక శిలా శాసనమునగలదు. కౌటిల్యుడు బృహస్పతి నీతికారుడు, శుక్రనీతికారుడు గిరిజనులను రాజులుగాని, చక్రవర్తులుగాని కేవలము తన సామ్రాజ్య విస్తరణకు, సామ్రాజ్య సుస్థిరతకు మాత్రమే ఉపయోగించుకొనవలసినదిగా సలహానిచ్చారుగాని వారి మనస్తత్వ మిటువంటిది. అందువలన ఆ ప్రాంత పరిపాలన యిటులుండవలెను, ఆ ప్రాంత పరిపాలకులుగా యిటువంటి వారలను నియమించవలెనో తెలిపియుండలేదు. శ్రీకృష్ణదేవరాయలు యీ విషయములను విపులముగా చర్చించినారు. గిరిజనుల కొరకై శ్రీకృష్ణదేవరాయలు వాడిన పర్యాయ పదాలు: భిల్లులు, దస్యులు, విలుకలు, ఆటవికులు, పార్వతీయులు. సార్వభౌముని ఆజ్ఞ గిరిజన ప్రాంతములలోకూడా చెల్లవలయుననే విషయమును 206 వ పద్యములో:

206 ఆ॥ ఆజ్ఞ వలయు నృపతి, కాజ్ఞ భిల్లాది
కంపకోలమాలనాజ్ఞ చెల్లు
నంట; సార్వభౌముడైన నృపతియాజ్ఞ
చెల్లనారు భిల్లుడిల్ల వలదె.

ఆటవిక నాయకుడి లంచకోరుకున్న నూలుపోగుకు ఎంతో విలువయున్నపుడు సార్వభౌమునియాజ్ఞ తప్పక జెల్లవలసినదే.

యిక గిరిజన ప్రాంతములందు ఎటువంటివారిని అధికారులుగ నియమించవలెనన్న —

221 కం॥ ధరణి నసాధ్య నగాటవు
లిరవుగ భూపీడసేయు నెఱుకుల పొరగా
స్థిరవగు నస్థితి శూరుల
కెరవుగ నిప్పునది, మిథము నెట్లయిన నురుస్.

ఎఱుకులు నివసించు ప్రాంతములను "అస్థితి శూరుల కెరవుగ" నిమ్మని శ్రీ రాయల ఉపదేశము.

"అస్థితి శూరుల కెరవుగ" ఎందుకీయవలయును? ఎందు కనగా ఒకప్పుడు మంచిపదవులలోనుండి (రాజ్యాధిపతులై, యుద్ధములో నోడిపోయి యితర రాజుల శరణు జొచ్చినవారని అభిప్రాయము) తమపదవినుండి దిగజారిపోయినవారు అస్థితిశూరులు. వారికి గిరిజన ప్రాంతములు "ఎరవుగ" నిచ్చిన, అటువంటివారు తమ పదవులను పునఃప్రతిష్ఠించుకో గోరుదురు. ఆటవికులు తమ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటకెల్లప్పుడు పాటుబడుదురు యిటువంటి స్థితిలో వారిద్దరికి వైరము తప్పదు. వారిలో వారు పోరాడుకొనుచుందురు. ఎల్లప్పుడు వారు తమలో తాము పోరాడుకొనుచుండటము వలన వారె వరు గూడా బలవంతులై రాజునకు ఎదురుతిరుగుదురనే భయ ముండదు. రాజా నిశ్చింతగా నుండవచ్చును.

యిక యీ క్రింది పద్యములు గిరిజనుల మనఃస్తత్వ పరిశీల నకు మచ్చుతునకలు. గిరిజనులకు మనమిదివరకెంత మేలుచేసినను ఏ కారణము వల్లనైనా మరొకసారి వారి కుపకార మొనర్పలేకపోయి నచో యిదివరకు చేసిన మంచిని మరచిపోయి శత్రుత్వము వహించె దరు మన శత్రువులతో చేతులు కలిపి హాని తలపెట్టుదురు. అప్పుడే స్నేహము, అప్పుడే శత్రుత్వము, చిన్నకారణముగా శత్రుత్వము వహిం చుట వారి సహజ లక్షణము. యీ రోజువరకు గూడా గిరిజనుల మనఃస్తత్వమిదియే! ఆటవికుల యీ మనస్సు, నడవడి నెరిగి, ఆ ప్రాంతములను పరిపాలించవలసినదిగా శ్రీ రాయలవారి సలహా. యీ విషయములు క్రింది వచనములో మరియు పద్యములలో కాన నగును

222 వ॥ విశేషించియు నప్పార్వతీయు బలంబు
లోనం గూడుకొన్న రాజునకు ప్రజా బంధకరుగ;
దెట్లని చెదరువాపికారలం జేకూర్చుకొనవలయు,
నవిశ్వాసంబును, విశ్వాసంబును, నలుకయు, నెల
మియు, నతి వైరంబును, నత్యానుకూలంబును
నల్పులగుట నల్పంబున నగుగు, నెట్లంటేని;

223 "విల్లుందాసును భిల్లుడొక్కడరుగ, న్వెండింట దుర్గస్థమున్
భిల్లుండన్యుడువెట్ట, నారయుడు కన్వీక్షించి దొబ్బాచువా
డెల్లస్వమ్ముగజేసి, తన్నునుపరా. నెందే దెగం జూడగా,
నుల్లంబై 'వసనంపు నారచెడు' నా నూహించి పోనంపడే

224 క॥ ఆపాల కూటనే నిజ
మేపాటియు దప్పరాడిరే, నెరసున గొం
లేపాటి గన్పనలుగుదు;
రీ పని యెంతనక నెడగు బెద నాటవికుల్.

225 తే॥ ఆటవిక నర్వకలన సత్యమున, వైరి
మనుజపతి పై చి దూతసన్మానమునను,
గూర్మి దరిద్రపు గాల్వరమున, నపారి
తోషిదప్పు సేవ నెలమి రౌతులకు గలుగు.

226 క॥ మేలగు పరోటకమును శం
కాలంబును నుత ను బాటనదే యున్మ; తరి
న్మేలగు మేపున మందుర
జాలింపుము; దొరలపాలు పనుపను మెపుడున్

దట్టమైన అడవుల ప్రాముఖ్యతను గూడా రాయ లెరింగి నాడు. గిరిజనులబాధ పొందక ఉండవలెనన్న దట్టమైన అడవులను పెంచవలసినదని శ్రీకృష్ణదేవరాయల అభిప్రాయము. గిరిజనులు దట్టమైన అడవులందు నివసింతురు. వారు మైదాన ప్రాంతములకు రావటమున కిష్టపడరు. అందువలన రాజ్యంలో దట్టమైనఅడవులను పెంచినచో గిరిజను లందే నివసించి యితర జనులకు కష్టనష్టము లను కలిగించరు. యీ అభిప్రాయము క్రింది పద్యములో కాన నగును :

256 క॥ అడవులు గడిదేశములవి
దడములుగా బెంపు మాత్మభరణి స్థలిక్
గడుములవి పొళ్ళపొళ్ళగ
బొడిపింపుము దస్యుబాధ పొందక యుండన్

భారతీయ రాజనీతి ఆలోచనలోనే శ్రీకృష్ణదేవరాయలది నరి కొత్తపంథా. యీరీతిగా ఆలోచించినవారు భారతరాజనీతిజ్ఞులలో లేరనే చెప్పవచ్చును. శ్రీకృష్ణదేవరాయలతర్వాత భారతదేశములో బ్రిటిషువారి పాలనారంభమువరకును గిరిజన ప్రాంత పరిపాలనా విషయమై యింకే "ఆలోచనా" రాలేదనే చెప్పవచ్చును. రాజ శాస్త్రజ్ఞులు యింకా నిశితముగా పరిశీలించినచో యింకా క్రొత్త విషయములు బయటపడునేమో!

# వేమన-స్త్రీ

పి. భారతి

శతక కర్తలలో చాలమంది స్త్రీలను నిందించినవారే! శతకమేమియు వ్రాయకున్నను కొన్ని కారణముల వలన శతక కారులలో ఒకడుగా వేమన ఖ్యాతిగాంచినాడు. శతకమునకు ముఖ్యలక్షణమగు సంఖ్యా నియమము వేమనకు లేదు మకుటము మాత్రము పెక్కు పద్యముల కొకటిగా నున్నది. స్త్రీలను నిందించుట గూడ శతక లక్షణములలో నొక్కటైనచో వేమనను గూడ నీ లక్షణమును బట్టి శతక కవి యని కొంతవర కొప్పుకొనవచ్చును !

వేమన స్త్రీలను మిగుల తిట్టినాడు. ఆనువారినిట్లిష్టము వచ్చినట్లాడుట నేడు అభ్యుదయవాదులమని చెప్పుకొనువారు వ్యతిరేకింతురు. వేమనకాక ఇంకొకరిట్లు కవిత్వము చెప్పిన ఈ అభ్యుదయ వాదులు ముక్కుముక్కుగా తిట్టి యా కవిని బహిష్కరించి యుండెడివారు! మన ప్రాచీన కావ్యములలో స్త్రీకి గౌరవస్థానమే యీయబడినది. స్త్రీల నవహేళన చేయుచు కవనమల్లిన కవులు మిక్కిలి తక్కువ. సుమతీ శతకకారుడు గూడ వేమనవలె చక్కని పద్యములను చెప్పినను 'మహాకవి' యనిపించుకొనకపోవుట మన దురదృష్టము. రాజకీయ సిద్ధాంతములను సుమతీ శతక పద్యములలో ముడిపెట్టి వ్యాఖ్యానించి, మహాకవి బిరుద మీయకుండుట యాయన యదృష్టము !

సంఘములో దుర్మార్గులైన స్త్రీలు కొందరు లేకపోలేదు. కాని యందరును అట్టివారిగానే భావించి పద్యములు వ్రాయుట వేమనకే చెల్లినది. వేమన ఎంత అసహ్యభావమును చెప్పుచున్నాడో చూడుడు—

> ‘‘తరుణి, సొగసుకాని తనయునిగన్నను
> మరుని కాలమెంచి మనను పొలు.’’

ఈ పద్యమును సమర్థించుటకెన్ని యుక్తులు పన్నినను లాభములేదు. స్త్రీల నీమాత్ర మర్థము చేసికొన్నాడన్నమాట వేమన్న! ఆధునిక మానసిక శాస్త్రవేత్తలు చెప్పుచున్న దానిని మన వేమన్న ఎన్నడో చెప్పెనని శంకలు గుద్దుకొందురా? ఆధునికమైన ప్రతి విషయమును మన ప్రాచీన భారతీయులెన్నడో చెప్పిరనుటను అభ్యుదయవాదు లొప్పుకొనరనుకొందును. ఇంకొక పద్యరత్నమును గాంచుడు.

> చక్కని సతిమైన సరసురాలైనను
> మేనాలులను గాన నీయకున్న
> సంపె గుంకిసంత సమ్మోటలాడదా
> విశ్వదాభిరామ వినురవేమ

ప్రకృతి సిద్ధమైన, సహజమైన స్త్రీ పురుష సంయోగ విషయమును దీసికొని వేమన యీనాడువారినిట్లు అవహేళన చేయుచుండుటకే! చక్కని పద్యములు చెప్పుట చేతయైనంత మాత్రమున నిట్టి పనికిమాలిన భావములనేల గైకొననో...? యోగియై, దిగంబరియైన వేమనకీ పాడు ఆలోచనలేల ? వేమన యోగి గాకముందే, వేశ్యలవెంట దిరుగుచున్నప్పుడే ఈ పద్యమును చెప్పెనని సమర్థింప జూచువారికి నమస్కారము!

గాడిదను, గుఱ్ఱమును ఒకే గాటకట్టివేయుటలో వేమన గట్టివాడు. స్త్రీలకు డబ్బే ప్రధానమనియు, ధనహీనుడైన భర్తను చంపుటకైన స్త్రీలు వెనుదీయరనియు, వేమన నమ్మకము. ఈ భావముతో పెక్కు పద్యములను ప్రసాదించినాడు.

> ‘‘కలిమినాడు మగని కామించి చూచును
> లేమి చిక్కునాడు లేకుండ
> మనిన మగనినైన మడియంగ జూచును...’’

> ‘‘కూలి నాలి జేసి గుల్లాము పనిచేసి
> తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
> లేమి చిక్కు విభుని నేమారు దిట్టును...’’

కొందరు పురుషుల కవి చక్కని సత్యములుగా తోపవచ్చును. అట్టివారిలో ముందే కొంత స్త్రీ ద్వేషముండి యుండునని నిశ్చయముగా చెప్పవచ్చును. వారు సహృదయులుకారు. కవిత్వమునకు సహృదయులే ప్రమాణము. చెప్పిన భావములనే త్రిప్పి త్రిప్పి ఎన్నిమారులో చెప్పినగాని వేమనకు తృప్తికలుగదు.

> ‘‘కలిమిలేని మగడు కానుగాడు
> పనికిరాని మగని పాటించి చూడదు...’’

—ఇది స్త్రీలను గూర్చిన వేమన ప్రవచనము! లోకములోనందరు

స్త్రీలను నిట్లన్న పురుషులు బతుకగలరా?

స్త్రీ స్వేచ్ఛను వేమన సహింపడు. "స్వేచ్ఛ బటియు విట చెర్లాటము సు నొప్పు" అని ప్రవచించినాడు. స్త్రీ కేవలము భర్తపై నాధారపడి జీవింపవలసిన క్షుద్ర జీవియని వేమన పద్యముల సారాంశము.

> "క్షితి వెలదికి దగు శృంగారములు నున్న
> విభుని కరుణలేక వెలయవట్లు..."

స్త్రీ సర్వశక్తిమంతురాలనియు, పురుషులతో సమానురాలనియు గద్దెలెక్కి పెద్దలెందరో యిప్పుడు చెప్పుచున్నారు. వేమన మాటలు నమ్మవలెనా? ఈ నవయుగ ప్రవక్తల పలుకులు విశ్వసింపవలెనా? వేమన ఏమన్నను, స్త్రీలశక్తి సామర్థ్యములను తక్కువగా నంచనా వేయువారిప్పుడు తక్కువగానే యుందురని తలపవచ్చును.

పురుషుల కష్టములకు స్త్రీలే కారకులట! "గతుల సతుల వలన గానంగ లేరయా!" అని వేమన వాపోవుచున్నాడు. "స్త్రీల వడతవలన సిగ్గు వోయె" అని బాధపడినాడు.

సౌందర్యవతులందరు కులటలని, కురూపులందరు పతివ్రతలని వేమనగారి యూహ! లేకున్న "రూపులేని వనిత రూఢి పతివ్రత" యని చెప్పునా? ఎంత వేశ్యాలంపటుడైనను; సానివాడలలో విర విహార మొనర్చి యున్నను స్త్రీల నిట్లెగతాళి చేయుట మర్యాద గాదనిపించుచుండుటలేదా?

వేమన వర్ణభేదము నంగీకరింపని మహాభ్యుదయవాది. నిజమే! కాని ఇది పురుషులవరకే పరిమితము. స్త్రీలైనచో నొప్పుకొనునా? చూడుడు —

> "మాల కన్నియలకు మంచి రూపంబున్న
> ముట్టునే త్రిశంకుపట్టి నాడు
> కాని పనులు సేయ ఘనులాసపడుదురా?..."

ఈ పద్యమునకు వేరువిధముగా నర్థము జెప్పి సమర్థింప ప్రయత్నించు మహాభావుకులు లేకపోలేదు! ఆ ప్రయత్నములు వారి తెలివి తేటలకు మాత్రమే నిదర్శనము లగునేమోగాని సత్య సందర్శనము మాత్రము కానేరదు.

భార్యను అణగద్రొక్కి పట్టవలెనట! అహా! ఏమి వేమన అభ్యుదయవాదము!

> "...లి నొంచ లేక యధమత నొందుచు
> వెనుక నుంటి నసుట వ్రాలితనము"

వేమన పురుషులకు స్త్రీలను భూతములవలె వర్ణించి చెప్పి భయపెట్టినాడు.

> "జార యాడుదాని నా బ్రహ్మసృష్టించె
> పురుషు పాలిటి పెనుభూతమట్లు
> దాని వలన జిక్కగాని వాడుండెనే..."

> "చక్కనైనవాని మక్కువ గన్నంత
> తక్కువగను జూచు తనదు విభుని
> ఆడు బుద్ధికంటె నపరబుద్ధియుకేది?..."

> "ఆడుదాని బొంకు గోడపెట్టినయట్లు
> పురుష వరుని బొంకు పూరితడక
> స్త్రీలవేర్పు మగల జీకాకు పరచురా...!"

వేమన స్త్రీలలో కొంచెమైన మంచిని చూడనట్లు కన్పించు చున్నాడు. స్త్రీలెప్పుడును పరపురుషులనుగూర్చియే యోచించు చుందురని వేమనయోగి నమ్మకము. అందువలన స్త్రీను వంటయింటి కుందేళ్లనుజేసి యుంచవలెనని, వారిని కనీసము కిటికీలలో నుండియైన బయటకు జూడనీయరాదనియు చెప్పుచున్నాడు.

> "జాలలోననుండి స్త్రీల వీధులవంక
> జూడనీయరాదు సుమ్ము వినర
> చేతురేని యట్టి చేటులు మూడురా...!"

> "వరుడు చక్కనైన వజ్రాలగనియైన
> ఛళుకు మెఱుపువంటి తత్త్వమున్న
> నన్యపురుషవాంఛ యాడుదానికినుండు...!"

ఈ పద్యములను చదివిన తరువాత స్త్రీలకేగాదు, సహృదయులైన పురుషులకు సహితము వేమన స్త్రీద్వేషియని స్ఫురించును. ఆయన భావములు స్త్రీల విషయము ఛాందసములని, మూఢములని స్పష్టమగుచున్నది. ఇట్టి అభ్యుదయ నిరోధకములగు భావములతో పద్యములను జెప్పిన వేమనను వెనుకవేసికొని వచ్చు మన అభ్యుదయ వాదులు నిజముగా వేమన పద్యములను చదువుచున్నారా యని యనుమానము కలుగుట సహజము!

# కలగూరగంప

"సంశోధిత మహాభారతము—అప్రకటిత పాఠములు" అను వ్యాసము లో (భారతి జూన్ 76) కళా ప్రపూర్ణ నిడుదవోలు వెంకట రావుగారు ప్రస్తావించిన పలువిషయములలో రెండు విషయములను గూర్చి నాకు తోచిన అభిప్రాయములు ఇందు పాఠకుల పరిశోధకుల ముందు ఉంచుచున్నాను.

1. శ్రీ రావుగారు నన్నయయొక్క "వాపి" శబ్దము యొక్క ప్రయోగములు చూపుచూ సభాపర్వమందలి 1-28వ పద్యము నుదహరించిరి. పై శబ్ద ప్రయోగము సభాపర్వములోనే మరి యొకచోట కనుపించుచున్నది.

"నిర్మల స్ఫటిక శిలావిర్మితరంగ...సదృశ పరిపూర్ణంబయిన వాపి సొచ్చి......" (2 140)

కావున నన్నయ "బావి" శబ్దము ప్రయోగింపలేదనియు "వాపి" శబ్దమునే ప్రయోగించెననుటకు మరింత బలము సమకూరినది.

2. "పాయకపాక శాసనికి......" అను పద్యము నన్నయ భారతమున తొలుత లేదనియు తరువాత అందు చేర్చబడినట్లు వివరించిరి. ఇచ్చట "పరమ వివేక సౌరభ..." అను ముందు పద్యమును అసమాపక క్రియతో ముగిసి "సారమతిం..." అను పద్యముతో అన్వయము చేయుటందవచ్చును. అది సభాపర్వములో నెచ్చటను నేను చూచినంతవరకు రెండు అసమాపక క్రియలు కలిగిన పద్యముల తరువాత సమాపక క్రియతో అన్వయముచేసిన పద్యత్రయము కనుపించదు. ఇది నన్నయ వైశిష్ట్యమునకు చాలా అరుదు అని భావింతును. కావున "పాయకపాక శాసనికి..." అను పద్యము మధ్యలో చొప్పింపబడిన దనుట సమంజసముగా కన్పించుచున్నది. ఈ క్రొత్త విషయముతో నారాయణభట్టు, భట్టు నారాయణుల గూర్చి భారతిలో జరుగుచున్న చర్చ గతి మారవలయునా!

— *డా॥ మద్దిపాటి శ్రీనివాసశర్మ*

## లేఖలు

## "గోధూమ ఘట్టన ఘరట్టు"

"కాకతి గణపతిదేవుడు—కళింగ దండయాత్ర" అన్న శీర్షికతో మే, 1976 'భారతి'లో డా. వై. గోపాలరెడ్డిగారు వ్రాసిన వ్యాసం చాలా ఆసక్తిదాయకంగా ఉంది. అందులో వారు ఉప్పరపల్లి శాసనాన్ని, త్రిపురాంతక శాసనాన్ని ఆధారంగా చేసుకుని జాయపసేనాని, భీమరాజు సిద్ధయదేవుడు గోధూమ జాతి అనువానిని యుద్ధములో వధించి "వైరిగోధూమ ఘరట్ట" "వైరి గోధూమ ఘట్టన ఘరట్ట" అన్న బిరుదులు పొందినట్లు వ్రాశారు. ఇంతేగాక జాయపసేనాని, భీమరాజు సిద్ధయదేవుడు, రాజనాయకుడు కాకతీయుల పక్షాన కళింగం పై దండు నడిపిన సందర్భంలో ఇందులూరి సోమదండనాయకుడు, ఏఱువ భీమరాజు, మొదటి తిక్కరాజు, మనుమసిద్ధి కూడా వారికి సహాయపడి గణపతి దేవుని కీర్తిని ఇనుమడింపజేసినట్లు కూడ వ్రాశారు.

ఈ కళింగదండయాత్రలో పై చెప్పినవారేకాక మరొక వీర శిఖామణి కూడ పాల్గొన్నట్లు సాహిత్యాధారాలవల్ల తెలుస్తోంది. కళింగ సీమలోని విజయనగర సంస్థానాన్ని పాలించిన పూసపాటి రాజులు పూర్వులు మధ్యయుగాంధ్ర చరిత్రలో ప్రముఖపాత్రవహించినట్లు వారి బిరుదు ప్రశస్తివల్ల తెలుస్తోంది. వీరు విశాఖమండలానికి రాక పూర్వం, ఆంధ్రప్రదేశంలో నాలుగు చెఱగులా రాజ్యం చేసినట్లు, మండలేశ్వరులుగా, మహామండలేశ్వరులుగా, దండనాయకులుగా పేరు ప్రతిష్ఠలనార్జించినట్లు వారికి సంబంధించిన సాహిత్యం సాక్ష్యమిస్తోంది. వారిలో ఒకరికి "గోధూమఘట్టన ఘరట్ట" అన్న బిరుదు నామముండేది. అతనికే "చోళ, భల్లాణ, గోధూమఘట్టన ఘరట్ట" అన్న బిరుదుకూడా ఉంది. డా. గోపాలరెడ్డిగారుదాహరించిన ఉప్పరపల్లి శాసనోక్త దండయాత్రలో ఈ వెలుగురాజుకూడ పాల్గొని, గోధూమజాతిని, పడిరాయుని నిర్జించడంలో ప్రముఖ పాత్ర వహించినట్లు ఊహించవచ్చు. తత్ఫలితంగా ఇతనికిని "గోధూమఘట్టన" బిరుదు లభించిందని భావించవలసి ఉంటుంది. ఇతనికిగల రెండవ బిరుదువల్ల మరికొన్ని విశేషాలు తెలుస్తున్నాయి. ఈ దండయాత్రలో ఇతడు ఒక్క గోధూమజాతినేగాక, చోళ, భల్లాణ నామములైన మరి ఇద్దరినికూడ ప్రమర్దించినట్లు తెలుస్తోంది. ఈ చోళుడు, భల్లాణుడు ఎవరో తెలుసుకోవలసిఉంది. "చోళ భల్లాణ" శబ్దం ఒక్క వ్యక్తినే నిర్దేశిస్తుందేమోనని కూడ ఆలోచింపవలసిఉంది. ఆ పక్షంలో ఈ చోళరాజు ఓపిలిరెడ్డి జయించిన కొనిదెన చోళరాజు బల్లిచోడుడేలకారాదు? ఏది ఏమైనా ఈ కళింగదండయాత్రల్లో కాకతీయుల పక్షాన పాల్గొన్న రాజుల్లో ఈ పూసపాటి రాజు ఒకడనడంలో విప్రతిపత్తి లేదు

ఇంతకూ ఈరాజు పేరేమిటి? ఎక్కడివాడు? అన్న ప్రశ్నలకు సమాధానం వెదకవలసి ఉంది. పూసపాటివారి పూర్వపురుషుల్లో ఒకడైన భీమరాజు ఏఱువ దుర్గాన్ని సాధించి, పాలించి ఏఱువ భీముడై

నట్లు, అతనికి చిక్కభీముడు పెద్దభీముడు, మైలమభీముడు అన్న నామాంతరాలు ఉన్నట్లు సాహిత్యంవల్ల తెలుస్తోంది. ఇతనిపై వేములవాడ భీమకవి చెప్పిన చాటువు "గరళపు ముద్దలోహము... మైలమ భీముని ఖడ్గసృష్టి కిన్" అన్న పద్యం ప్రసిద్ధమైంది ఈ మైలమ భీముడు, వేములవాడ భీమకవి కూడా పదమూడవ శతాబ్దివారనే అనేక చారిత్రకుల అభిప్రాయము. కనుక ఈ గోధూమ ఘట్టిన ఘటోత్కచుడైన రాజా ఏలువ భీమరాజని, డా. గోపాలరెడ్డి గారుదాహరించిన ఏలువ భీమరాజా, ఇతడు ఒక్కరేనని నిశ్చయించ వీలౌతోంది. ఇతని చరిత్ర ఇంకను పరిశోధించవలసి ఉంది.

ఉప్పరపల్లి శాసనంలో చెప్పబడిన "పడిరాయ"లెవరో సరిగా తెలియుటంలేదు. కాని శ్రీ కూర్మక్షేత్రమందలి ఒక శాసనంవల్ల [S. I. I. vol V No. 1181] ఈ పడిరాయలు ఇంటిపేరు ఉల్లాడి వారని, ఇతని కొడుకు నారాయణుడని, అతడు శ్రీ వీరనరసింహ దేవుని కాలములో దళాధిపతి అని తెలుస్తోంది. చూడుడు :

"...శకవర్షంబులు 1263 గున్నేటి శ్రీ ప్రతాప వీరనరసింహ దేవవిజయరాజ్య సంవత్సరములు 18 శాహిని కుంభకృష్ణ దశమి శుక్రవారాన శ్రీ కూర్మనాథుని సన్నిధిని కొలువనుకట్టు మానవ నాయకునికి ఉల్లాడ పడిరాయని కొడుకు నారాయణదళపతిం గారు తమకు ఆయుష్కామార్థ ఫలసిద్ధిగాను చేసిన దత్తము..."

— డా గంటి శ్రీరామమూర్తి

# సందేహము—సమాధానము

మే నెల భారతిలో శ్రీ మాదిరాజు శ్రీరామమూర్తిగారు నన్నయగారి గరుడోపాఖ్యానమందలి "దానవ పరార్ధకాయ విహీనుడగు (భార. ఆది. 2-6) అను పద్యములో "అపరార్ధ" శబ్దసాధుత్వ విషయమున తమ సందేహమును వెలిబుచ్చి యిందు వ్యాకరణ విషయకమైన గ్రంథి యేదైన నున్నచో తెలుపవలసినదిగా తమ లేఖ మూలమున కోరియున్నారు ఈ విషయమున నాకు తోచినరీతి వారి సందేహమును నివారించుటకు ప్రయత్నించెదను.

"పూర్వాపర ప్రథమ..."(అష్టా 2-1-58)అను సూత్రముచే అపర శబ్దమునకు పూర్వనిపాతము వచ్చుచుండగా 'అపరస్యార్ధే పశ్చభావో వక్తవ్యః" అను వార్తికముచే అపర శబ్దమునకు అర్ధశబ్దము పరమగుటచే పశ్చాదేశమువచ్చి "పశ్చార్ధ" అను రూపమేర్పడవలసి యుండగా 'అపరార్ధకాయ' యను ప్రయోగమెట్లు సంగతమగునని శ్రీ శ్రీరామమూర్తిగారి సందేహము కాని యిట మొదట అపర శబ్దమునకు అర్ధశబ్దముతో కర్మధారయ సమాసము చెప్పక 'అర్ధం కాయస్య అర్ధకాయః' అనురీతి 'అర్ధం నపుంసకమ్' (అష్టా 2-2-2) అను సూత్రముచే అర్ధశబ్దమునకు కాయ శబ్దముతో తత్పురుష సమాసమును, ఆ పిమ్మట అపర శబ్దమునకు అర్ధకాయ శబ్దముతో కర్మధారయమును (అపరశ్చాసౌ అర్ధకాయశ్చ) చెప్పవలెను. ఇట్లు చెప్పినచో సామానాధికరణ్య మున్నపుడు మాత్రమే ప్రవర్తించు "అపరస్యార్ధే పశ్చభావో వక్తవ్యః" అను వార్తికమునకు సామానాధికరణ్యములేని 'అపరార్ధకాయ' అనుచోట (ఇట అపర శబ్దము అర్ధకాయః అను శబ్దమునకు విశేషణ మగుటచే పుంలింగమును, అర్ధశబ్దము నపుంసకలింగమును అగుటచే సామానాధికరణ్యములేదు) ప్రవృత్తి యుండదు. అప్పుడు పశ్చాదేశము రాక 'అపరార్ధకాయ' అను ప్రయోగము సంగతమే యగును ఇంకేహా అపర శబ్దమునకు మొదట అర్ధశబ్దముతో కర్మధారయమును చెప్పిన పిదప అపరార్ధ శబ్దమునకు కాయశబ్దముతో సమాసము చెప్పుట దుర్ఘటము. కావున పైన నేను తెలిపిన రీతిగా మొదట అర్ధకాయః (అర్ధపిప్పలీ అను రీతిగా) అను సమాసమును, పిదప అపరశబ్దమునకు అర్ధకాయశబ్దముతో కర్మధారయమును చెప్పినచో పై వాగనుశాసనుల ప్రయోగమున పశ్చాదేశమును నివారించవచ్చును.

—శ్రీ ఆర్. శ్రీహరి

* * *

జూలై 'భారతి'లో మా "కథలు" "బాకీ బాకా" సమీక్షలు వేసినందుకు సంతోషం.

ఈసారి రివ్యూలు కాస్త ఆబ్జెక్టివ్‌గా వున్నాయి. అయినా సమీక్షలలో ఇతర రచయితల పేర్లు ఉదహరించినపుడు, సోదాహరణగా "కోట్"చేసి, ఈ పుస్తక రచయిత/లు ఆ "ప్రఖ్యాత" రచయితలని ఈ విధంగా అనుకరించేరు వగైరా రాయాలిగాని, కేవలం వారి పేర్లు మాత్రం రాసి ఆ పేర్లకి అదనపు ప్రచారం మా పుస్తకాల సమీక్షల ద్వారా రావడం ఆరోగ్యమైన పనికాదని, మొన్న 18-7-76 ఆదివారంనాడు సమావేశంలో మా కార్యవర్గం కామెంటు చేసింది.

కనుక ఈ లేఖని మీ "కలగూరగంప"లో ప్రచురించడమో, లేదా సమీక్షకుని పొరపాటు 'భారతి' ద్వారానే సవరించుకోవడమే సముచితం అని మా కార్యవర్గ అభిప్రాయం. ఆపై మీ యిష్టం.

— శ్రీ నిష్టల వెంకటరావు
(ప్రెసిడెంట్, ట్వెంటీయత్స్ సెంచరీ రయిటర్స్), విజయనగరం

# గ్రంథ విమర్శలు

## శ్రీ బండ్రెడ్డి ఉండ్రమూడి సత్యనారాయణ కృతులు

### కులశధార

[డెమ్మి 1/8; 65 పారటలు; మూల్యం రు. 6/-]

ఈ కవితాసంపుటిలో "పదునెక్కిన పలుకులు" అన్న మున్నుడిలో పెద్దలు కుందుర్తిగారు కవికుమారుని పాఠకునికి పరిచయం చేస్తున్నారు. "కవి అనుభూతులు ఆ రచనలలో తొంగిచూస్తూనే ఉంటాయి" అన్న నిత్యసత్యం చెప్పినారుగాని, అవి ఆరోగ్యకరమైనవి అయితేనేగదా లోకం బాగుపడేది. "వ్యావహారికభాషాపద ప్రయోగం కౌశలం వచన కవితకు ప్రాణం వంటిది" అని ఇంకొకమాట అంటారు. పద్య కవితకుగూడ ఇదే ప్రాణమన్నది అందరి అనుభవంలోని విషయం. తిక్కన, పోతన, శ్రీనాథ, ఆధునికాలు —రాయప్రోలు, దువ్వూరు, జాషువాల కవితలకు ప్రాణం అందం ఈ వ్యావహారికభాష, తెనుగు క్రియలేనని; వారు తమతమ మాండలికాలనే ఎక్కువగా దొర్లించినారని తెలుసుకొని ఆనందిస్తున్నాము. ఆధునిక యువతరంలోగూడ చాలామంది యీ జాతీయ నుడికారాన్ని చేపట్టుతున్నారన్నదే ఈ విప్లవ యుగంలో తెనుగునుడి తల్లి భాగ్యం అనాల. ఇక, అన్నీ తెలిసిన కుందుర్తివారే "ప్యారడీ తెలుగులో జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రిగారే ప్రారంభించినా" రనడం సాహసం. వేదం వారి ప్రతాపరుద్రీయంలో పేరిగాడి రాచరికము, పానుగంటివారి కంఠాభరణం, కాళ్లకూరి నారాయణరావుగారి అపూర్వ సంఘసంస్కరణం (తోక తెగినవక్కకథ, కట్టమంచివారి పీఠిక) మొదలైనవి వికటానుకరణాలేగదా. జగ్గకవి చంద్రలేఖా విలాసానికి మించిన ఎగతాళివ్రాత గలదా ? 50 ఏండ్లనాడు మాపూర్లో "కుందుమేకు"– చింతాశల్యం అని ఒక కవివ్రాస్తే, ఇంకొక పండితుడు "చింతమేకు" అన్న ప్యారడీ వ్రాసినాడు. ఇవి కుందుర్తివారి మనసుకు రాలేదు- అంతే.

ఇక కవితా సంపద :

'తలపులో రంపకోత రానీయకు, నిస్థానం నీకేడున్నది' (ప్రస్థానం) అని అసూయలేని విశ్వాసాన్ని చూపుచున్నారు, అంటే అర్హతకు తగిన ఫలం దొరుకుతుందంటారు. 'ఏ అమ్మ కన్నదో ఏ అయ్య పాపమో ఈ ముద్దు పసికందు, తమ్మిలేటి నీట తనువు చాలించింది' అని అనుకంప రసాన్ని పారించి, పాపం అనేదిఉంటే — అది కన్న తలిదండ్రులదేగాని యిట్టి అనాథలదికాదని వీరి అభాగ్య జీవితాలకు భాగ్యం కల్పిస్తున్నారు. 'తెనుగు వెలుగు' లో మన పెద్దల కీర్తిని హాయిగా పాడుతూ లిస్టులో [ఇది ఇన్నే వచ్చేహోని యిట్లాటిదే] రాయప్రోలు వారిని జాషువాను వదలివేయడం మంచి అభిరుచి అనిపించుకోదు. 'మారణహోమం' 'భావమరీచులు' 'వెన్నుపోటు'లో సంస్కృత సభ్యత సంప్రదాయం కావాలని, నేటి అరాజక సమ్మర్దంలో ఒక హాహాధ్వనిని వినిపింప జేస్తున్నారు- కవి. 'హోటల్ చరిత్ర' లో ఒక మారుమూల పల్లెబస్‌స్టాండ్ హోటలులోగూడ ఉండేదానికి విలువలేని నిక్షేపాన్ని కవి చెపుతాడు. హెల్తు డిపార్టుమెంటు నేటి ఎమర్‌జెన్సీలోగూడ నిదురబోతున్నట్లున్నది. అయినా, ఒక గుక్కెడు కాఫీకి నిలువున 150 పైసలు వదలగొట్టే మరికొన్ని హోటళ్లను చూపి, యీ జలదారు గుంటలను శుభ్రత నేర్చుకోమని కవి చెప్పి ఉంటే బాగుండేది. 'కళ్లు'లో వివిధ నేత్రాల వర్ణన బాగున్నది. చంద్రమండలంలో మనిషికాలుబెట్టిన తర్వాత ఇక (కొత్త పుంత) ఇక కవులకు ఉపమానాలు, విరహిణులకు ఉపాలంభనాలకు చోటుండదేమో అని బాగా కోడిగం పట్టించినారు. 'ముండ్లడొంక'లో కృషికుని భావాలలో సహజమైన నుడికారం బాగున్నవి. భావానికి తగిన భాష యీ కవిది.

### కాకుస్వరాలు

[డెమ్మి 1/8; 82 పేజీలు, ధర రు 6/-]

ఇది సాంప్రదాయిక కవితాసంపుటి. రచయిత తమ సవ్యసాచిత్వమును చూపుచున్నారు. ఇందు సత్యనారాయణగారి అంతర్గత సహజ ప్రతిభకు (ఎలిమెంటుకు) తగిన పనిముట్లుగా ఉన్నది—పద్యాలు, భాష, ధార. డాక్టర్ శంకరశ్రీ రామారావు అన్నట్లు యీ పుస్తకం "రంగురంగుల పూలతో గ్రుచ్చిన పూలమాల". వివేకానంద దివ్యవాణి శీర్షికలో విషయం ఉత్తేజకరంగా ఉన్నది "జగములన్నియు వ్రాలు మీ చరణసీమ" అని ఆ హిందూమత వన పునర్వికసన వసంతుని కొనియాడుచున్నారు. (కాలం) "వెలుగు నీలుగులు లవని కలకాలముండవు. నీలుగు లేక వెలుగు కలుగబోదు" అని పాతసత్యాన్ని కొత్త మాటలలో చెప్పినారు." "తేరు చక్రాలు వరుసగా తిరుగు తెరగు" (భాగ్యచక్ర పరిభ్రమణాలు) అన్నదీ యిదే ఫక్కీనుడికారం.

'బల్బు'ను గూర్చి, దాని నిర్మాత ఎడిసనును గూర్చి చెప్పినది, ఆ బల్బు మాదిరే కొత్త తెన్నులో ఇంపుగా ఉన్నది. తిక్కన కాలంలో ఇది ఉండి ఉంటే ఆయన ఇంకా ఎన్నో వ్రాసిఉండేవారుగదా అని అంటారు కవి. జాతీయ నాయకులు దేశస్థితినిగూర్చి వ్రాసిన పద్యాలు

చనిలేకుండా బలవంతపు వ్రాతగా కనిపిస్తున్నవి 'కపోత మిథునం' అని తిక్కన కపోతోపాఖ్యానాన్ని యీయన తిరిగి ఎందుకు వ్రాయ వలసి వచ్చిందో! దానికి మెరుగు పెట్టగలనని అనుకొన్నారు కాబోలు; పోల్చుకపోయినా సారస్యంగా లేదు ఇక 'కాకస్వరాలు' మంచి అవహేళన రచన. భావం-ఎత్తుగడ-ఎత్తిపొడుపు కొత్తచూపుతో పక్షుల నుడి కారంతో హృద్యంగా ఉన్నది. దేవతల వాహనాల సంగతి చెపుతూ- "నేపథ్యంలో పెక్యూన్" అని కాకిచేత వాపోవజేస్తున్నారు; కాని, అంద రినీ పట్టి ఏడ్పించే శని గహానికి వాహనం కాకి అన్నది వీరికి తట్టి నట్లు లేదు. "చచ్చినవారి యోగ్యత బయటపెట్టేను వారి పిండ ములు ముట్టన్" అని వేమనవలె దెబ్బదీసినారు; పితరులమీద సామె తల ఇంగితజ్ఞానంతో నిండిఉన్నది-యీ ఖండిక.

## మణిమాల

[క్రౌన్ 1/16-40 పేజీలు; వెల రు. 2-50 చక్కటి ముద్రణం.]

చాటువులు సామెతలు భాషకు చైతన్య భూషణాలు. మన శతకాలవలె కవి వ్యక్తిత్వము స్వాతంత్ర్యము మొదలగు వాటికి ఇవి నిలువుటద్దాలు. చిన్న పెద్ద అనక యీ పద్యాలు ఒక్కొక్కటి సత్యాన్ని లోకరీతిని, మానవ స్వభావాన్ని-నవరసాలలో చెప్పగలిగిన ప్రత్యేక సాహిత్య ప్రక్రియలు చేవ గలిగి ఉన్నందున ఇవి ప్రతివాని నోట వాని. సంభాషణలలో ఉదాహృతాలై రాణిస్తవి.

ఇది తెలిసే, ఆర్షసంప్రదాయ లోలమైన బండ్లమూడివారి మనసు సంస్కృత చాటువులు శ్లోకోక్తులపై వ్రాలి కొన్నింటిని తెనుగు చేయిస్తున్నది. మూలభావాన్ని తగిన భాషలో పొదిగి, కుదింపు చేత భాషకు చిక్కదనం కూర్చి కుంటులేని నడకతో విషయానికి ప్రాణంపోసి పద్యంలో నిలుపుతున్నారు చెవికి ఇంపైన నుడికారం పల్లెటూరువారు కాబట్టి కృతిమం లేకుండా అబ్బిఉన్నది. వీరు పదములలో జాతి సామ్యాలపొందు పాటిస్తారు; తెనుగు పదాల నడుమ సంస్కృతం చొప్పించరు ఇదే చిన్నయసూరి భాషకు వన్నె తెచ్చినది

తెనుగురాటు ఇంతకుముందే నానుడుల్లో దట్టంగా అలముకొని పోయి ఉన్నవాటిని ఈయన చేపట్టకుండా ఉంటే బాగుండేది. పోల్చి ఒరపువేసి తగ్గు మొగ్గులు తెల్సుకొనేటట్లు చేయవలసిన అగత్యం ఏమి వచ్చినది. 7. వ. చిన్నయసూరిది; 12. నన్నయది; 28 (పని చేయునెడల దాసియు) 62 (తలమందు విషము ఫణికిని) సుమతివి; 10. (తమ ఉదకంబు వాహినులు త్రావవిదంగి) భర్తృహరిది, "కవిత నరసికులకు వెపుకర్మ మొకటి తలను వ్రాయంగ వలదోయి. వలదు, వలదు" అన్న తెనుగు బాగున్నా, వేదం వెంకటరాయశాస్త్రి "అరసి కాళ్ళమోల నరసకావ్యముచెప్ప నుదుట వ్రాయువలదు, వలదు" అన్నదానికె వచ్చి ఎక్కువగదా.

ఇక సమానంగా ఉన్నవి :-72-

"గతము గూర్చిన తలపు సంగతముకాదు భావి గూర్చిన చింతయు ఫలము నీదు నయవిశాలురు వర్తమానమ్మె నమ్మి..." అన్న ఒకటే భయ్యా ధోరణి, దువ్వూరువారిది చూడండి:- "గతము గతంబె యెన్నటికి కన్నుల గట్టదు. సంశయాంధ సంవృతము భవిష్య దర్శము, వివేకవతీ, యొకవర్తమానమే సతత మవశ్య భోగ్యమగు సంపద.." రెండూ సరికొత్తవి ఉద్ధిగా వడుస్తున్నవి.

కవి ప్రజ్ఞారంభుడు-ముందున్న కవితా జీవితం శోభానందం. ఈ మూడు పుస్తకాల ప్రాప్తిస్థానం:-ఇందుమతీ ప్రచురణలు; నరసింహారావుపేట; ఏలూరు-2-534002.

## త్రయీనాదము

[వానమామలై వరదాచారి, దాశరథి నారాయణరెడ్డిగారల కవితా సంకలనము. డెమ్మీ 1/8-62 పొరటలు; ధర రు 3/- ప్రతులకు : భారతీ సాహిత్య సమితి; కోరుట్ల; కరీంనగర్ జిల్లా.]

ఈ సంకలనం పేరుతోనే డాక్టర్ బి. వి. సుబ్రహ్మణ్యం గారు 'స్వరమేళ'లో అన్నట్లు, మూడు వేదాలను స్మృతికితెచ్చి, పాఠ కుని ఒక అలౌకిక స్థాయికి తీసికొనిపోతున్నది తెలంగాణా కవి త్రయం కళాప్రపూర్ణ వానమామలై వరదాచారి, కళాప్రపూర్ణ దాశరథి (కృష్ణమాచారి) డాక్టర్ సి. నారాయణరెడ్డి వారికి అస్మానసపులు, యీ స్థానానికి ప్రజాకవులు. సుకవి పోతన వారసు-వానమామలై (పోతాద్రి) ప్రాచీన ఆర్యసం పదాయానికి ప్రతినిధి; దాశరథి నైజాము కాకుపాలనను ఎదిరించిన స్వాతంత్ర్యవీరుడు, పారసీ తెనుగు కలగలుపు రసాన్ని తావి ప్రావించే సాహిత్య తపస్వి డాక్టర్ నారా యణరెడ్డి నవ కవికుమారులకు తోవచూపే సౌంస్కృత కళా రసి కుడు. వీరి ముగ్గురి కవితాస్రవంతులు ఈ పయోగలోవలె యీ సంపుటంలో సంగమించినవి.

ఆచారిగారి ప్రబంధ గౌరవము, దాశరథి అధునాతన రీతులు, నారాయణరెడ్డి కొత్త పాతల కలయిక ఒక ఉదుస్మృతో రాయప్రోలు వారు అన్నట్లు "ఏకిపోని చేవమాటల"తో తమ రసానుభూతులను చెప్పి అనుభవింపజేయగలిగిన మహాకవులు.

అన్నమంతా వడ్డించి గడ్డపెరుగుతో ఇష్టభోజనం చేసి త్రేపగలిగిన ఓపికపోయింది-నేటి జనానికి అందువల్ల నాలుగు కూర లతో వివిధ రుచులతో మిష్టాన్నం తినడమే ఈనాటి చదువులవిందు. ఈ అలవాటుకు అభిరుచికి అనుగుణంగా ఇప్పుడు సంకలనాలు వెలు వడుతున్నవి. పెద్ద పుస్తకాల చదువు పాతబడినది. ఈ సంపుటం ఆ తెగలో, వ్యక్తిగౌరవం విషయగౌరవంతో అలరారుతున్నది. ఎవరికి రుచించినదాన్ని వారు అనుభవించవచ్చు.

ఈ ముగ్గురు ప్రముఖులు పాఠకుల రుచిచూచి, నోరూరించే బంతికి సంపాదకులు ఏరికూర్చి పాఠకునికి ఉపాహారం పెట్టుతున్నారు.

## అడుగుజాడలు

[కుందుర్తి కృతులపై సమీక్షా వ్యాససంకలనము : డెమ్మీ 1/8 120 పేజీలు; రు 5/-దొరకుచోటు : శ్రీనివాస సాహితీ సమితి; 1-1-336/58; వివేకనగర్; హైదరాబాద్-500020.]

సాహితీ సంఘాలు ఏర్పడి, తమ సభ్యుల రచనలు-వేరు వేరుగా-కలగలుపుగా అచ్చువేసి వెలువరించడం యీ ఋతుధర్మంగా ఉన్నది. ఇది అత్యంతోపకారి; ఇది పాఠకునికి భిన్నరుచులను భిన్న

రీతులను రుచి చూపుతున్నవి. ఇట్టి ప్రశంసనీయ ప్రయత్న ఫలితమే ఈ సమీక్షా వ్యాససంకలనం. ఈ శ్రీనివాస సాహిత్య సమితి మంచి పలుకుబడి గౌరవ గలిగిన సాహిత్యపరుల చేతిలో ఉన్నది; ఎగుడు దిగుడులు లేకుండా సాగిపోగలదని విశ్వాసం.

కుందుర్తివారు వచన రచనలో అన్నిటా చాలిన మొనగాడు. కొత్తపోకడలను ఒక స్వకీయ వైచిత్ర్యంతో చెప్తారు. మొగమాటంతో మాటలు మింగరు. వీరు తమ వ్రాతలన్నిటిని కలిపి 950 పేరటల పెద్ద పుస్తకాన్ని వెలువరించినారు. దానిని గరుడదృష్టిగా—18 మంది విమర్శకులు, తమ తమ దృక్పథాలతో కుందుర్తివారి రచనలను ఇందు వ్యాఖ్యానించినారు. ఈ రచయితల విభిన్న అభిరుచులను వారి శీర్షికలే ప్రకటిస్తున్నవి. ఈ వ్రాతలు కుందుర్తి వ్యక్తిత్వాన్ని కవితావేశాన్ని రచనా వైఖరిని సందేశ ఆదర్శాలను నఖశిఖ పర్యంతం వివరించి చెపుతున్నవి. ఒక్క కవి వ్యాసంగంపై ఇంత పెద్ద సమాలోచన జరపడం. ఆ యోచనలను ఒక గ్రంథ రూపం దాల్పించడం ఈ ప్రచురణ ప్రత్యేకత.

రచయిత సరుకునుబట్టి అనుసరించవలసిన సాహిత్య ప్రక్రియగానే ఉన్నది ఇది. దీనిని నాసేదానికి ఇదొక రూపాంతరం.

## అశోకధర్మచక్రము

[ఛందోబద్ధమైన ఖండకావ్యం; కర్త : భాషా నవీణ మన్నె నాగేశ్వరరావు; క్రౌన్ 1/16 52 పారటలు; వెల రు 2/–; ప్రతులకు: గ్రంథకర్త; నెహ్రూ జిల్లాపరిషత్ హైస్కూల్; అన్నికట్లు; గుంటూరు జిల్లా.]

ఈ ధర్మచక్రం బుద్ధునిదా? అశోకునిదా? (ఇది ఈ గ్రంథకర్తకు సంబంధించినదికాదు మన సంవిధానకర్తలు అవలంబించినారు, గ్రంథకర్త అనుసరించినారు.) సిద్ధార్థుడుకదా—బుద్ధుడైన తర్వాత మొట్టమొదటిసారిగా సారనాథలో (సారంగనాథవనం) ధర్మచక్రాన్ని ప్రవర్తింప జేస్తానన్నది? అది మొదలు బుద్ధవిగ్రహానికి క్రింద చక్రం మలచబడుతూ వచ్చినది. అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించి నప్పుడు దీనిని చేపట్టినాడు. ఇది నా ఊహ, పెద్దలు ఏమంటారో!

మన్నె నాగేశ్వరరావుగారి కవిత్వం అన్నిటా ఆంధ్ర ప్రబంధ సంప్రదాయబద్ధము. వసంతము—హంసలు—జలక్రీడలు — విరహాలు—చైత్యోపచారాలు—కనిసమయాలు—ఇవి ఈయన కవితా సామగ్రి. కళాపూర్ణంగా ఉపయోగిస్తే అన్ని ప్రక్రియలూ సరస్వతికి సొమ్ములేగదా. వీటిని గ్రంథకర్త భాషలో భావంలో సాఫీగా వాడినారు. శైలిలో మంచి నడక ఉన్నది; నుడికారపు సొంపూ ఉన్నది. కాని, కథను అల్లడంలో ముందువెనుకలు మారినవి. ఉన్నట్లుండి సందర్భశుద్ధి లేకుండా పాత్రల ప్రవేశపెట్టడం జరుగుతున్నది అశోకుని భార్య కరవాకి ఆమె చెలులు ఇక్కడ అశోకుని యుద్ధానికి అంతగా అవసరం లేదు; అంటే కథక చాతురి కొంత లోపించిన దనాల.

కృతి—పూర్వప్రబంధరీతిలో చక్కగా ఉన్నది.

## జవాబులేని ప్రశ్న

[గద్యకవిత. కర్త : కాశీపల్లి యోగేశ్వరరావు; క్రౌన్ 1/16 55 పేజీలు; వెల రు 2/ ప్రతులకు స్పందన సాహితి సమాఖ్య—న్యూ మునిసిపల్ క్వార్టర్సు—మచిలీపట్నం—521001.]

ఈనాటి అలవాటు చొప్పున వచనాన్ని పద్యంమాదిరి అచ్చు వేసిన కవితా సంపుటి—ఇది కవికి కాలగతి వలపోతలవల్ల కలిగిన ఆవేశం ఉన్నదిగాని, ఒక్కొక్కచోట మనసులో మాట చెప్పలేక మర్మ కవిత్వంలో పడుతున్నారు. "తెలుగు వెలుగు"లో శ్రీనాథుని కవిసమ్రాట్టు అంటారు; ఇప్పుడు ఈ మాట ఇంకొకరికికదా తగులుకొనేది? ఈ ఖండికలో కొందరు తెనుగు కవులపేర్లు ఇచ్చినారు. తనకు నచ్చిన వారినేగదా పేర్కొంటారు అనేమాట న్యాయమైనది కాదు. పేరుమోగిన రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరు రామిరెడ్డి, జాషువాలను దిగవేయడం సరసతకాదు. మొదలు లిస్టు ఇవ్వపూను కొంటే వచ్చే బెడదే ఇది.

"ఇంద్రధనుస్సు"లో (కవిధనస్సు అంటారు) నల్లరంగుడున్న దనడం ఊహాస్వాతంత్ర్యమే! "ఆకాంక్ష"లో జీవితానికి ఈతి బాధ లంటారు ఈ ఈతిబాధలు దేశానికే గదా? కాడి ఒరిపిడికి కలిగేది ఆరుపుండు—ఎద్దుపుండు కాదు. కవి కృషికుడైనట్లు కనుపించడు.

ఇంగ్లీషు పదాలను నడుమ ఇరికించడం (చాలా శీర్షికలలో) గిరీశంస్టైలి అయినా, తెనుగులో ఆ పదాలకు తగినవి లేకపోలేదు ఏ విధానంలోనైనా తెనుగుదనం పోకుండా ఉండటం మంచిది.

కవి మంచి నుడికారం చవి చూడండి :— "అలసిపోయిన కనురెప్పలు నిద్రతెరలను కప్పుకొన్నాయి"; "మాటలు వెలుగును కుమ్మరిస్తుంటే మనసు చీకటి మసిని పూసుకుంటోంది" ఈ "టోంది" వర్తమానమో భవిష్యత్తో తెలకుండా ఉంటున్నది ఈ కవి "సుఖాన్ని పంచగల విజ్ఞానం కావాల" అనడం సుచిరమైన యోచనాసరణి. లేకుంటే—అణువిజ్ఞానం పుట్టించిన బాంబువలె, భస్మాసురుని యోగ శక్తివలె మానవాళినే తుదముట్టించదా?

"సమాజం"లో సంఘంపై మంచి విసురులే ఉన్నది. "సమస్య ఏమిటో మీకూ నాకు తెలుసు" (హాస్యోపకరణం సొంపుగదా)లో కవి హృదయావేదన తెలుస్తున్నది. "మేధస్సులో చైతన్యపు పారిజాతాలు

పూరించే వివేకానందులు కానరారు" అన్న ధర్మావేశం రచయిత సంస్కారాన్ని -లుపుతున్నది.

## తరతరాల తెలుగువెలుగు

[డాక్టర్ సి. నారాయణరెడ్డి; క్రౌన్ 1/16; 43 పేజీలు; (సమాఖ్యావాది విషయం ముందువెనుకలో మరికొన్ని పేజీలు); వెల: రు 3/-; ప్రతులకు: స్పందన సాహితీ సమాఖ్య; 23/182E; న్యూ మునిసిపల్ క్వార్టర్సు, మచిలీపట్నం – 521001.]

ఈ చిన్న నృత్యగేయ రూపకాన్ని- ఆంధ్ర కవితాశిల్ప తపస్వి- డా. సి. నారాయణరెడ్డిగారు, ప్రపంచ తెలుగుమహాసభలలో ప్రదర్శింపచేసే దానికి వ్రాసినారు. దీనిని రసవత రంగా ప్రదర్శించి ఆ తెలుగు పండుగలో జనులకు వీనుల విందుగూర్చినారు.

యక్ష కన్యలు కథాగానంగా–ఆంధ్రుల సమగ్ర చరిత్ర గీతంగా, పద్యంగా, జంగం కథగా – ఐతరేయ బ్రాహ్మణం మొదలు ఆ సభల లోపలివరకు పాడి, పర్యసింపచేసినారు. "అటు పాట శిల్పుల మిటు దావ్య కటకమ్ము ఇరు కంబములుగ కట్టిరి తోరణాల్" అంటూ ఆ సభా వేదికపై ఆంధ్ర కీర్తి నాటకం ఆడించినారు.

పదబంధ చతుర కళా రసికుడు – నారాయణరెడ్డి "ఆంధ్ర సంస్కృతిమణి గణ కాంతులు అంబరాల వర్తింప" జేసినారు. ఆట్టి ఆంధ్ర చరిత్ర సంస్కృతి సాహిత్యదీధితులు" నవ కాంతుల వెదజల్లే దీపమాలగా" చివరన ఆంధ్రమాతకు హారతి ఎత్తించినారు.

తెనుగు బిడ్డ కండలు కదలించి కండ్లెర్ర జేయించే వీర రసము, ఇంపున కరగిపొయ్యేటట్లుచేసే సాహిత్య చంద్రికలు, రాల కరగించే గేయకారుల సంగీత వారాశి అలలను తన్మయుల జేసిన కీర్తి, పులకెత్తే తీరున వ్రాసినారు-రెడ్డిగారు. వ్రాతకు జీవం పోసినట్లు ఆ సభలలో ఆడించినారు.

ఇది ఆంధ్ర సంగ్రహకీర్తి గీతిక.

— *శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి*

## రెండు లఘుకృతులు

[1. సప్తదినాధిపస్తవము – నవగ్రహమంగళ స్తోత్ర సహితము. రచయిత విద్వాన్ శ్రీ బులుసు–వేంకటేశ్వరులు, ఎం. ఏ. వెల 1 రూ. పుటలు 15. ప్రాప్తిస్థానం తెలియదు.]

[2. తేనె సోనలు – (జానపదగేయ సంకలనం) సంకలన కర్త – శ్రీ చొక్కపు–నారాయణస్వామి, గాయత్రీ ప్రచురణలు, ఉ. కొత్తపల్లి, డోన్ తాలూకా, కర్నూలు జిల్లా, క్రౌను 49 పుటలు, వెల సాధారణప్రతి రూ. 3 లు. లైబ్రరీ ఎడిషన్ రూ. 5 లు. ప్రతులకు ప్రకాశకులకు వ్రాయవలెను.]

1. ఆదివారం మొదలు ఏడు వారాలకూ సూర్యాది సప్త గ్రహాలు అధిపతులు, రాహు, కేతువులనే ఉపగ్రహాలతో కలిసి నవ గ్రహాలు. ఇది పేరుకు సప్తదినాధి పస్తవమైనా రాహుకేతువుల స్తవాలుకూడా ఇందులో చేర్చబడినవి. చివర నవగ్రహమంగళాష్టకం చేర్చబడింది. ఇవి అనువాదమో స్వతంత్ర రచనయో తెలియదు. బహుగ్రంథకర్తలై మంచి కవులుగా ప్రఖ్యాతి గడించిన వేంకటేశ్వర్లు గారి కవితాధార యిందులో ధారాళంగా ప్రవహించింది. అందరికీ సులభగ్రాహ్యమై ఉన్నది. నవ గ్రహమంగళాష్టకం చివర సంస్కృత శ్లోకమూ, దాని అనువాదమూ ఉన్నవి. తెలిగింపు మూలానికి అన్యూనానతిరిక్తంగా సాగింది —

మూల శ్లోకం —

"ఆరోగ్యం సవితా తనోతు భవతా మిందుర్యశో నిర్మలం
భూతిం భూమిసుతస్సుధాంశు తనయః ప్రజ్ఞాం గురుర్గౌరవమ్
కావ్యః కోమల వాగ్విలాసమతులాం మందో ముదం సర్వదా
రాహుర్బాహుబలం విరోధిశమనం కేతుః కులస్యోన్నతిమ్."

ఆంధ్రానువాదం —

రవి యారోగ్యము దివ్యకీర్తి శశి యు
ద్దండంబుల్ ధరిత్రీజుం డిం
పు ప్రజ్ఞన్ బుధుడున్ సురాళిగురు ప
త్యంతంబు సంపీలి గా
రవమున్ గోమల వాగ్విలాసమును భృ
ప్రఖ్యాతుఁ డానందశ
క్తిని వంశోన్నతి మందరాహువులు ప్రీ
తిన్ గేతువున్ గూర్చుతన్.

2. సహజంగా కవులై, రచయితలైన చొక్కపు నారాయణ స్వామిగారు ఎన్నో గేయాలు, వ్యాసాలు, నాటికలు, కథలు వ్రాశారు. ప్రాచీన వచన వాఙ్మయంపైని, జానపదగేయాలపైని ఆసక్తి ఎక్కువ. ఆయన ఎంతో శ్రమపడి సంపాదించి సంస్కరించి 'బ్రహ్మాండపురా'ణాన్ని ఇదివరకే ప్రకటించారు. ఇపుడు ఇరవైమూడు జానపద గేయాలను సంకలనంచేసి 'తేనె సోనలు' అనే పేరుతో ప్రకటిస్తున్నారు. జానపదగేయాలు చాలావరకూ ఎంతో మధురంగా ఉంటాయి. వాటికి ఈ పేరు తగి ఉన్నది.

జానపద గేయాలనుగురించి పరిశోధనలుచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు బి. రామరాజుగారు డాక్టరేటు

పొందారు. హరి ఆదిశేషువుగారు తెలుగు భాషాసమితి బహుమతిని పొందారు. ఆచార్య శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పరిశోధనలు జరిపారు. ఏ తత్సంకలన కర్తలుకూడా ఈ విషయమై ఎంతో ఆసక్తిచూపి వీటిని ప్రచురించడం సంతోషించదగినది. జానపద గేయాలపై ఉత్సాహాన్ని వృద్ధిచేసిన ఆచార్య గోపాలకృష్ణమూర్తి గారికి ఇది అంకితం కావడమున్నూ మెచ్చదగినది.

'ఈ సంపుటిలోని జానపదగేయాలు అనంతపురం, కర్నూలు, మహబూబునగరము మండలములలోని' వని నారాయణస్వామిగా రంటున్నారు. ఇందులోని 'పుట్టింటికి' అనే శీర్షిక ఉన్న గేయం అర్ధ శతాబ్దికిందటే కోస్తాజిల్లాలలో ప్రసిద్ధంగా ఉంది. 'వెంకటసుబ్బి' శీర్షికలోని గేయం 'మోహనరంగ' పదంగా తెలుగునాట అంతటా వ్యాప్తమై ఎప్పుడో గ్రామఫోన్ రికార్డులకు ఎక్కింది. నేను చిన్నప్పుడు విన్న పాటలివి. మరికొన్ని గేయాలుకూడా దేశవ్యాప్తమైనవి ఇందులో ఇచ్చినవి ఉంటే ఉండవచ్చును కూడా. ఈ సంకలనంలోని గేయాలన్నీ కొత్తవి అని శ్రీ శ్రీపాదవారి అభిప్రాయం. (చూ. ఉపో.) ప్రసిద్ధమైన గేయాలు రెండింటినిగూర్చి తెలిసినది చెప్తాను. అందువల్ల 'అన్నీ కొత్త' వనుకోవడం సరికాదేమో అని నాకు తోస్తున్నది. ఈ పుస్తకంలో ముద్రితాలైన గేయాలకంటె వాటి వాడుక రూపాలే ఇంపుగా కానవస్తున్నవి.

'పుట్టింటికి' (పుట 31) గేయానికి అవతరణికలో అత్త వారింటినుంచి పుట్టింటికి వెళ్లడానికి భర్త అనుమతి కావాలన్నారు. కాని, మన సంప్రదాయాలనుబట్టి అత్తమామల అనుమతి అంతకంటె ముఖ్యం. ఇంక అధికారాన్నిబట్టిచూస్తే ఆడబడుచు అనుమతి అన్నిటికంటె ముఖ్యమైనది. వాడుకలో ఉన్న గేయంలో ఆడబడుచే అనుమతి నిచ్చినట్లుంది. ఆ గేయం ఇంతకంటే రసవంతంగా ఉంది. ముద్రితగేయంలో కొంతభాగం లోపించింది. అత్తింటి కోడలు ఉదయాన్నే చల్ల తిప్పుతూ ఉంటే అన్నలొచ్చిన వార్త తెలిసింది.

'చల్ల చేసే పాప చక్కన్ని పాప
మీ అన్న లొచ్చేరు చల్ల చాలించు'

ఈమాట వినగానే ఆ ముగ్ధ

'ఏరేరి అన్నల్లు ఎంతదూరాన ?'

అని అంటూ పోయి

'ఏడడుగు లుండంగ కాగలించుకొని
ఏమిరా అన్నయ్య యిన్నాళ్లకని

ఆలస్యం చేసేవేమని ప్రశ్నగా చూస్తే, అ
'చేనుకోతలనుంచి చెప్పంపలేదు'

అని సమాధానం యిచ్చి, అనుమతి తీసుకుని తనతో పుట్టింటికి రమ్మని ఆప్యాయంతో పిలుస్తాడు. ఆమె మామగారి దగ్గరకు వెళ్లి

'పట్టెమంచంమీది ఓ మామగారా !
మా అన్న లొచ్చారు మమ్మంపుతారా ?

అని అడిగితే ఆ మామగారు

'అదియేమొ నేనెరుగ మీ అత్త నడుగు'

అని అంటారు. అత్తగార్నడిగితే బావగార్నడగమంటుంది. అతని దగ్గరకు పోయి

'పెద్దిల్లు దిద్దేటి పెదబావగారా !
మా అన్న లొచ్చారు మమ్మంపుతారా ?'

అని అడిగితే అతడు

'అదియేమొ నేనెరుగ మా చెల్లి నడుగు'

అని అంటాడు. ఆడబడుచు నడిగితె

'ఎత్తుకో బాలుణ్ణి ఎక్కు గుర్రాన్ని'

అని ఆమె అనుమతి నిస్తుంది. మధ్య మధ్య ఎందర్ని అనుమతులు అడిగి వుండవచ్చు. చివరి నిర్ణయం ఆడబడుచుదే! ఇతరులను అడిగేటప్పుడు ఆ లిస్టులో మరిది, చెల్లెలుకూడా ముద్రితగేయంలో చేర్చబడ్డారు. కాని, వాళ్ళు వాడుకలోఉన్న గేయంలో లేరు. వాళ్ళ అనుమతి అనవసరం. 'వెళ్లివస్తాను' అని వాళ్ళతో చెప్పడమే సముచితమూ, సంప్రదాయమున్నూ.

మోహనరంగ పదానికు 'వెంకటసుబ్బి' శీర్షిక ఎలావచ్చిందో తెలియదు. గేయంలో ఆ పేరు కానరాదు. వాడుకలో ఉన్నదే ఎంతో రమ్యంగా ఉన్నది. ముద్రితప్రతి—

'కోట దాటి పేట దాటి
ఘనమైన అడవి దాటి
సెక్కరాళ్ల బోటుమీద
సెక్క వచ్చి సెంప తగిలెనే గదరా' (పుట. 34)

వాడుకలో ఉన్నది —

'గట్టు దాటి పుట్ట దాటి
ఘనమైన వనముదాటి
అది దాటి అడవి బడితిమిగదరా !
చలో మోహనరంగ'

వాడుకలో ఉన్నదే సబబుగాను, ఇంపుగాను ఉన్నది. ముద్రితగేయంలో మధ్యలో పదనకూడా మారిపోతున్నది. ఎంతో మధురంగా ఉండె

'నీకు నాకూ జోడు అయితే
మలె పూలా తెప్పకట్టి
తెప్పమీద తేలిపోదాం గదరా !
సిల్ మోహనరంగ'

వంటి చరణాలు ముద్రిత ప్రతిలో కనబడవు పుస్తకంలోఉన్న గేయంలో కొన్ని చరణాలలోఉన్న భాషకూ, ఇతర చరణాలలోని భాషకూ చాలా వ్యత్యాసం కానవస్తున్నది.

నారాయణస్వామిగారు తమకు లభించిన రీతిని వీటిని ప్రచురించి వుండవచ్చును. కాని జానపద వాఙ్మయంలో ఎంతో కృషిచేసి, దీన్ని ప్రశంసించిన పరిశోధకులయినా, తమ ప్రస్తావనాదుల్లో వీటిని గురించి కొంత చెప్పివుంటే బాగుండేది. ఇంతకూ సంకలన కర్తల ప్రయత్నం ప్రశంసించదగింది.

ఇది అందరూ చదువుకొని ఆనందించదగిన పుస్తకం. కాబట్టి ముద్రణ స్పష్టంగా ఉంటే ఇంకా ఎంతో బాగుండేది

— "అంగీరస"

## సాహిత్యవ్యాసములు

[రచన : శ్రీ వై. వి. యస్. యస్. యస్ మూర్తి ఎం.ఎ. పుటలు : 59 ప్రతులకు : ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు రాష్ట్రపతిరోడ్డు సికిందరాబాదు. వెల : రు 3-00]

## వినయామృతి

[(సుమతి శతకానికి సుజనరంజనీ వ్యాఖ్య) రచయిత : డా. వి. వి. యల్. నరసింహారావు. ప్రకాశకులు : ఆంధ్ర సాహితీ సమాఖ్య. 23-182-ఇ. మ్యూనిసిపల్ క్వార్టర్సు, మచిలీపట్నం. పుటలు : 60 వెల : రు 2-00]

సాహిత్యంయొక్క స్వరూప స్వభావాలను ఆవిష్కరించి చెప్పే గ్రంథాలు సాహిత్యవ్యాసాలు. ప్రాచీనాధునిక కవుల కావ్యాల విశ్లేషించే గ్రంథాలనుగూడ సాహిత్య వ్యాసాలనే అంటాం. అయితే యీ పుస్తకం పై రెండింటికీ సంబంధించినదికాదు అలా అని పూర్తిగా భిన్నమూ కాదు ఇందులో సాహిత్యపరుల వ్యాసాలున్నాయి. ప్రక్రియా పరమైన వ్యాసాలుకూడా వున్నాయి. కాబట్టి యీ గ్రంథం పై రెండు నిర్వచనాల సమాహారం.

ఇందులో ఆరువ్యాసాలున్నాయి. రచయిత హిందీభాషలో గూడ నిష్ణాతులవడంచేత తనకున్న తెలుగు సాహిత్యాభ్యాసంతో వేమన కబీరుల ప్రజాకవితలోని సామ్యవైషమ్యాలను మొదటి వ్యాసంలో వివరించారు రాజుల మెప్పుకోసం రచన చేసేవారు రాజకవులవుతే, ప్రజాభ్యున్నతికి కవనంయిచ్చే కవులు ప్రజాకవులని భావం. ఉత్తర హిందూస్థానంలో కబీరు, ఆంధ్రదేశంలో వేమన సంస్కరణ శీలురు. వారి జీవిత సాహిత్యాలను రచయిత తోలనాత్మకంగా సముచిత లక్ష్యాలతో చూపించారు అయితే భాష విషయంలో రచయితే చెప్పుకున్నట్లుగా వ్యావహారికాన్నే స్వీకరించినా దానికైనా నియతి వుండాలిగదా! జీవితంను, వాదంను, బ్రహ్మంను-ఇత్యాది పదాలు 'ఇతో భ్రష్టస్తతో భ్రష్ట' అన్నట్లున్నాయి విశ్వజనీనత కొరకు కృషిచేసిన ఈ మహనీయుల వ్యాసం గ్రంథంలో మొదటగా చెప్పటం మనోహరం. శతక సాహిత్యంలో పౌరాణికాఖ్యానాలు అనే రెండోవ్యాసం రచయిత పరిశోధనా పటిమకు ప్రతీకగా వుంది. అసలు శీర్షికలోనే నవ్యత వుప్పుడి. తెలుగు శతకాలు సంస్కృత ప్రాకృత శతకాలకు భిన్నమైనవి అన్న భావాన్ని విస్తరిస్తే బాగుండేది అలాగే వేమనగారి సేతువిర్మాణానికి సంబంధించిన పద్యాన్ని కూడ వ్యాఖ్యానిస్తే అపోహలకు తావుండదు. ఈ వ్యాసంలో బహుశ ముద్రాపకుల దోషంవల్ల కావచ్చు. చివరి మూడు పేరాలు పునరుక్తి దోషానికి గురి అయ్యాయి.

మూడవవ్యాసం ఒయిన వీరేశలింగం పంతులుగారిని గూర్చిన నవయుగ వైతాళికత్వం సంపూర్ణంగా వెల్లడికాలేదు. శీర్షికలోవున్న గాంభీర్యం వ్యాసంలోలేదు. లోన్యాయితోనున్న రచన. ఆధునికాంధ్ర సాహిత్యంలో దేశభక్తి కవిత అనే వ్యాసంలో శీర్షికలో నూతనత్వం లేకపోయినా విధానంలో విశిష్టతవుంది. చిలకమర్తివారి ప్రసిద్ధమైన "భరతఖండంబు చక్కని పాడియావు" పద్యం, రాయప్రోలు అభిమాన కవితలో "మా తెలుగుతల్లికీ మల్లెపూదండ" వంటి గేయాలు వదలివేయ దగ్గవికావు. రచయిత విస్మరించారు. ఈ వ్యాసంలో యిచ్చిన అలంకారకవుల సూక్తులు చాల సందర్భసుందరంగా వున్నాయి. ఆధునిక తెలుగు సాహిత్యంలోని నగర జీవిత వర్ణన గూడ ముఖ్యంగా వుంది. తిరుగుబాటు కవిత్వనుగూర్చి చెప్పిన ఆఖరు వ్యాసంకూడా చాలి వివిధంగా వున్నది. నాటినుండి నేటివరకు తిరుగుబాటే జరుగుబాటుగాగల కవుల విప్లవగీతాలను మంచి లక్ష్యాలుగ యిచ్చారు. భారతాంధ్రీకరణమే పెద్ద తిరుగుబాటు అన్న వారి భాషలోని భావం స్థూల దృష్టికి గోచరించదు. పూర్వకవుల కవితలో వున్నంత ఉదాత్తత ఈ కవులలో లేదని వివరంగా ఏదు పలికిన విసురు నవ్యాసయులలో ఆలోచన రేకెత్తించగలగాలి. ఆంతవరకు చిత్తశుద్ధి, పాండితీ పటిమగల యిలాంటి రచయితలు తమ రచనలలో ఆంధ్రభాషయొక్క నలంకరించవలసిందే.

*

"శతశ్లోకేన పండితః" అన్నది సంస్కృతసూక్తి. దాన్ని ఆంధ్రీకరించుకుంటే శతకం వచ్చినవాడు నాజ్ఞానపండితుడు.

ఆ నూరు పద్యాలను నూరుకోవాలంటే పండిత పామర జనరంజకమైన శతకాలను చేపట్టాలి. కుమతులను సుమతులను చేసేవది, తెలుగునాట అత్యంత ప్రజాదరణ గలది సుమతీ శతకం. ఆ శతకమే సద్యోహృద్యం. వేరే భాష్యాలక్కరలేదు. కాని డాక్టరుగారివంటి పరిశోధనా జిజ్ఞాసువులు యింకా సుమతీ శతకంలోని సౌరభాలను ధర్మమర్మాలను విప్పి చెబుతుంటే మనకింకా ఆనందదాయకమేగదా! వీరు సుమతీ శతకంలోని మధుర శలాకలను సర్వజన మనోరంజనంగా నవరసభరితంగా 'ఆంధ్రావళి మోదముం బొరయ' అందించారిటీవల. రసరాజమైన శృంగారానికి కొంచెం మొగ్గు చూపటం "కామి కానివాడు మోక్షకామికాడు" అన్న మాటకుపబలకంగా వున్నది. సుమతీ శతకకర్త చెయ్యని శీర్షికల విభజన వీరు చేయటం వాల క్రమబద్ధంగా వున్నది. విధి నిషేధాలు, సుజన దుర్జన లక్షణాలు. విద్యాప్రశస్తి, అధికారుల మదాంధత, విత్తం ప్రభావం, కాముక ప్రవృత్తి, స్త్రీతత్వం, శృంగార రసజ్ఞత, పురుషార్థ ప్రాధాన్యం బడిపిల్లవాడికి కూడ అర్థమయ్యే కమ్మని తేటతెనుగు నుడికారంతో వివరించారు. చివరగా సుమతీ శతకకారుని అభ్యుదయ దృక్పథాన్ని ప్రశంసిస్తూ నేటి సామాజిక రీతినీతులను విశ్లేషించి చూపారు. స్త్రీ జన ప్రవృత్తిని వివరించడంతో రావుగారు సుమతీ శతకకర్తకన్న మిన్నగ ప్రతిభావంతంగా తన పాత్రను నిర్వహించారు.

సుమతీ శతకంలో ఒకచోట "అక్కఱకురాని చుట్టము" అని మరోచోట "కలిమైనను బంధుజనుల కడకేగకుమీ" అన్నాడు అందులోవున్న స్వవచో వ్యాఘాతాన్ని వీరు గమనించి వుండవలసింది బద్దెనకవి తెల్పిన నీతులకు లౌకిక పారలౌకిక సేతువు నిర్మించి వీరు ఫలోన్ముఖులైనారు. బద్దెన "కరణము సాధైయున్నను" అన్న పద్యంలో కరణాలను భంగ్యంతరంగా దుష్టులని చెప్పిన దానిని వీరు ఆత్మరక్షణకోసం అని సమన్వయించడం సహేతుకంగా తోచదు. బద్దెన 'కోమటి'ని తెగడి కులకాంతను పొగిడాడు. ఆ రెండు పదాలకు వ్యత్యాసంలేదు. కోమటి శబ్దంకన్న 'వైశ్య' పర్యాయ వాచకం మరేదైనా ప్రయోగిస్తే బాగుండేదేమో! "సరసము విరసముకొఱకే" అన్న పద్యంలోని చివరి రెండు పాదాలను వ్యాఖ్యాత జేటి జగతి క్రమ గుణంగా విభావిస్తే యింకా బాగుండేది. భోగలక్షణంలో "దాని సిగ్గోయ్య" అన్న పదంపట్ల వీరిచ్చిన చెణుకు చాల ఆహ్లాదకరంగా వుంది. ఒక మాటలో చెప్పాలంటే ముని ప్రామాణిక్యం వారి గ్రంథం చదువుతూన్న అనుభూతిని అందించారు సుజనరంజని వ్యాఖ్యాత.

"వినదగు నెవ్వరు చెప్పిన" అన్న సుమతీ శతక కర్త పలుకు ఈ వ్యాఖ్యానానికి వర్తించదు. పండిత ప్రకాండులైన వీరి వాణి 'వినదగు నెంతయు చెప్పిన' అన్న రీతిలో సహృదయులను అప్పు తార్చునవలె వున్నది. రసజ్ఞ శేఖరులైన వీరింతటితో ఆగక మన శతక వాఙ్మయంలోని మరికొన్ని ఆణిముత్యాలను ఆంధ్రలోకాని కందిస్తారని ఆశిద్దాం.

"విద్యానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" యన్నట్లుగ 'యువభారతి' కోవలో ఇట్టి గ్రంథాలను వెలువరిస్తున్న స్పందన సాహితీ సమాఖ్య వారినిగూడ యీ సందర్భంగా అభినందించాలి.

## వి మ ర్శ ని

[(వరంగల్లు స్నాతకోత్తర విద్యాకేంద్ర తెలుగు విభాగపు పరిశోధన పత్రిక) పుటలు: 134 వెల : రు. 10 00. సంపాదకుడు : శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు, తెలుగు శాఖాధ్యక్షులు, ప్రచురణ: తెలుగుశాఖ, పి జి. సెంటరు, వరంగల్లు (ఆం. ప్ర.)]

నాటినుండి నేటివరకు మనకు అనంతమైన గ్రంథ సాహిత్యమైతే వున్నదిగాని, దాని గుణదోషాలను నిగ్గుచూపే విమర్శనా గ్రంథాలు విరళం అనే చెప్పవచ్చు. ఆ వున్నవైనా "పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్య యోజనా ఆక్షేపస్య సమాధానమ్ వ్యాఖ్యానమ్ షడ్విధమ్ మతమ్" అన్నట్టి వ్యాఖ్యాన ప్రాయమైనవి, విమర్శకులనే వారి పాక్షిక ప్రవృత్తులకు ప్రతిబింబంగా నున్నటివేను. ఉన్నత పరిశోధనా మనస్కులకుత్తమ సాహితీ సౌరభాలనందించే యీ 'విమర్శిని' ప్రాదుర్భావం ఆ లోటు పాట్లను తొలగించేదిగా గోచరించడం ఆనందదాయకం; అందరికీ ఆమోదయోగ్యంకూడ. వరంగల్లు పరమ పట్టభద్ర విద్యాకేంద్రపు తెలుగు శాఖవారు వెలువరించిన యీ పత్రిక 'లోనారసి' చూడగా "వాణీవాయించు మ్రోగిన వీణ మీద" సాగిన సరస స్వరాలిందులో రసజ్ఞులకు విందుగా వున్నవని నిస్సందేహంగా అనవచ్చు.

"విరచించుంతి పుట్టని పురుషుని నిదువులు ప్రకాశములు గావు" అనే యథిభాషణను లక్ష్యంగా చేసుకుని సాహిత్య నిత్య సత్య ప్రతులైన ఆచార్యవర్యులు రూపొందించిన అయిదు ప్రామాణిక వ్యాసాలిందులో "సాహిత్య ప్రక్రియలలో ప్రయోగాలు వెలిసినంత వేగంగా ప్రయోగ విజ్ఞానం కావటంలేదు" అని సందేశం అందించిన వైస్-ఛాన్సలర్‌గారి బాణాల ప్రభావంగా భాసిస్తున్నాయి. ఉత్కృష్టమైన పరిశోధనాత్మక వ్యాసాలు మాత్రమే ప్రచురించబడాలని సమాజాలు నెలకొల్పమనే ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షుల ఆకాంక్షకు అక్షరరూపాన్నిచ్చేవిగా వున్నాయి.

ఆధునికాంధ్ర కవితా స్వరూపాన్ని విశ్లేషించి చూపే వ్యాసాన్ని వివేకానందుని దివ్యవాణితో ఆరంభించబడ్డ మొదటివ్యాసంలో పాశ్చాత్య

కవితాతత్త్వాన్నెక్కువగా పుణికి పుచ్చుకున్న తెలుగు సాహిత్యంలోని నవ్యతను సుప్రసన్నాచార్యులవారు సునిశిత ప్రజ్ఞాపాటవంతో ఆవిష్కరించారు. పాశ్చాత్య సంస్కారము, స్వాతంత్ర్యోద్యమం, క్షీణప్రబంధయుగ శైథిల్య కవనానికి జవనాన్ని కూర్చటం, పతితజాతియాత్మ పునరుద్ధరణ. ఈ నాలుగు లక్షణాలు నవ్యకవితకు బహిరంతర కారకాలు, ప్రేరకాలు అని వీరిభావన. నవ్య కవితానాటకానికి నాందీగీత మాలపించిన గురజాడ, రాయప్రోలు వారల బహిరంతర వ్యక్తులను వీరు బహిర్గత మొనర్చిన తీరు ఎంతో మతి ప్రతిభా సమన్వితంగా వున్నది. చక్కని తార్కికశక్తి, సాంప్రదాయలక్ష్య స్వీకారం, చిక్కని పాండితీ ప్రకర్షలో గూర్చిన వీరి వ్యాసం సహృదయ నైవేద్యంగా వున్నది. జ్ఞాన విజ్ఞాన జిజ్ఞాసకోసం విస్తరింపబడ్డ రాయప్రోలు వారి కావ్యతాత్వికతను మధుర మనోజ్ఞంగా దర్శింపజేశారు. నవ్య కవితలో సంగీత సాంగత్య లక్షణాల నిక్షేపించిన బసవరాజు, నండూరి, విశ్వనాథవారి రచనలను రసపారమ్యంగా అభివర్ణింపబడ్డాయి. గురజాడలో వ్యక్తిదగ్గర ప్రారంభమై, రాయప్రోలువద్ద దేశానికి విస్తరించి, అబ్బూరి రచనలతో విశ్వ జనీనత సంతరించుకొన్నది నవ్యకవితా వస్తువన్న వీరి వ్యాఖ్య సముచితంగావున్నది. దువ్వూరివారి స్వాతంత్ర్య రథానికి వీరొసగిన వ్యాఖ్యానం వీరి పరిశోధనా పటిమకు ప్రతిబింబం.

నవ్య కవితలో స్పష్టాస్పష్టంగావున్న భావరేఖల స్వరూప స్వభావాలను అత్యుత్తమ భావ బంధురంగా వివరించారు రెండవ వ్యాసకర్త శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు. ఎంతో సూక్ష్మేక్షికతో సందర్శింపబడిన యీ వ్యాసంలో ఖండ కావ్యాలు, భావకావ్యాలతోలనాత్మక సమీక్ష గావింపబడి రసతత్కావ్య స్వరూపం చూపింపబడ్డది. ఖండ కావ్యము భావకావ్యముకాదు. రసకావ్యం భావకవిత్వం కావచ్చు. కాని భావ కవిత్వము రసకావ్యము మాత్రం కాదు. అని వీరి భావం ఆసక్తిదాయకంగా, పరిశీలనాత్మకంగావున్నది. ఈ వ్యాసంలోగూడ రాయప్రోలువారి భావకవితా దర్శనం స్పష్టరేఖలలో చిత్రించబడ్డది. పాశ్చాత్య భావనమైన 'రొమాంటిసిజమ్' లక్షణాలను వివరించి దాని మౌలికత కృష్ణశాస్త్రివంటి అనంతర భావకవులలో విస్తారం అంటారువీరు. భావకవిత్వాన్ని భావ వాద మార్గానికి మరలించిన విశ్వనాథ, భౌతిక మార్గానికి మరలించిన శ్రీశ్రీ గారిలోని అంతరాలనెరుకచేసే ప్రయత్నంలో యీ వ్యాసకర్త సఫలీకృతులైనారనే చెప్పవచ్చు. ఇరువురి లక్ష్యం అభ్యుదయమేనని సంప్రదాయం, అభ్యుదయం అన్యోన్యసంబంధులని వీరుచూపిన ఉపపత్తులు వీరి యువలోచనా ప్రదర్శనకు చక్కని నిదర్శనంగా వున్నాయి. ఆధునికాంధ్ర సాహిత్యంలో వారిరువురూ వ్యాస, వాల్మీకులన్నమాట పదుగురుకి వచ్చేదే. గురజాడవారి ముత్యాల సరాలలో యిమిడిన మార్దవం సౌందర్యం గోచరించవన్నమాట అంత సమంజసంగా తోచదు. సామాన్యులలోగూడ ప్రాచుర్యం పొందినవిగదా అవి. విశ్వనాథవారి గిరికుమారుని ప్రేమ గీతాలలోని భావవైశిష్ట్యాన్ని అన్నిటికన్న మిన్నగ సమగ్ర స్ఫూర్తితో యిచ్చారు రచయిత. తెలుగు సాహిత్యంలోని భావ కవిత్వం వెనుక భారతీయ తత్త్వ విజ్ఞానం ద్యోతక మవుతుందనే వీరి వక్కాణ అర్థవంతంగా వున్నది. ఆత్మాశ్రయ కవిత్వాన్ని నవ్య భావకవితగా అభివర్ణించి అందులో వైయక్తిక ప్రతిభ, ఆత్మీయతా ముద్ర కారణంగా సామాజిక నీతి స్వల్పమంటారు. అందుకే "కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికే బాధ" అన్న మాట పుట్టిందేమో!

భావ కవిత్వానికి మలిదశ అయిన అభ్యుదయ కవిత్వపు తీరు తెన్నులను శ్రీశ్రీగారి అంతర్ముఖీన స్వరూపంతో జోడించి, తదుపరి వ్యాసంలో సద్యోహృద్యంగా చెప్పారు ఈ రచయిత. ప్రపంచ చరిత్రలోని వస్తు వైలక్షణ్యాలు అభ్యుదయ కవితకు సృజన హేతువు లంటారు వీరు. నవ్యాంధ్ర కవితలో భావ కవిత్వాన్ని అంతర్ముఖిగాను, అభ్యుదయ కవితను బహిర్ముఖిగాను భావించారు. వ్యక్తి వైలక్షణ్యానికి తార్కాణమైన సంప్రదాయకవితకు, సంఘజీవిత రీతికి ప్రాధాన్యమైన అభ్యుదయ కవితకు వీరు చూపిన సామ్యవైషమ్యాలు యెంతో మేధోద్దీపకంగా వున్నాయి. ఆదర్శ దర్శనంలో రెండూ ఒకటే గనుక నేటి అభ్యుదయ కవులు చారిత్రి కావగాహనలో మానవతా వాదాన్ని నాటక రూపంలో నిర్మాణంచెయ్యటానికి సిద్ధపడితె అభ్యుదయ సాహిత్యానికి మహోన్నతదశ అనే వీరి యాకాంక్ష పదేపదే కనబడి సమాజాన్ని నిరసించే నేటి అభ్యుదయ కవులకు కనువిప్పు కలిగించవచ్చు.

ఈ గ్రంథంలోని నాలుగో వ్యాసంలో మాదిరాజు రంగారావుగారు శ్రీశ్రీగారి మహాప్రస్థానానికి ప్రేరక శక్తులను ఆనాటి ప్రపంచ పరిస్థితుల నాధారంగా చేసుకొని సమీక్షించారు. రాయప్రోలు వారు సంప్రదాయ జగత్తులో ఆధునికుడని, గురజాడ ఆధునిక జగత్తులో అభ్యుదయ కవియని వీరి ప్రభావం సర్వేసర్వత్ర శ్రీశ్రీ గారిలో వుండటం సద్యోహృద్యంగావుంది. శ్రీశ్రీగారి అపూర్వ వ్యక్తిత్వంలోని ఒక ముఖాన్ని మాత్రమే చూపిన వీరు తక్కిన ముఖాలనుగూడ త్వరలో సహృదయులకు దర్శింపజేస్తారని విస్తృతమైన యీ వ్యాసాన్నిబట్టి అనుకోవాలి. చివరి వ్యాసంలో డాక్టరు జి. వి. సుబ్రహ్మణ్యంగారు స్వీకరించిన వస్తువులో నవ్యతవున్నది. ఛందోబంధాలు తెంచుకొని, భావనాస్వేచ్ఛను పెంచుకున్న శ్రీశ్రీగారి కవితలోని పురాణ ప్రతీకలను సంక్షిప్తంగానైనా, అందంగా అందించారు. అవతారం గేయంలోని శ్రీశ్రీ వాణికి మాతృకగా భావింపబడే తిక్కన బాణిని, మంత్రం, భావివేదముల, ఇది సవనం-ఇత్యాది పదాలలోని సంప్రదాయార్థ ప్రక్షాళనచేసి అభ్యుదయ కవితా సామగ్రిగా

3 ఈ గ్రంథమున సరసింహరావుగారు శాస్త్రులవారి రచనలలో ఇంతవరకు వారికి దొరికిన 3 స్వరజతులును, 2 తాన వర్ణములును, 38 కీర్తనలను ప్రచురించి యున్నారు. అయితే వారు గ్రంథమున మొదట యిచ్చియుండు సూచిక పట్టికలో ఒక కృతిని చేర్చక 37 కీర్తనలని మాత్రము తెలిపియున్నారు. మొత్తపు రచనలు 43 అని యుండుటకు బదులు 42 అని వ్రాసియున్నారు. పట్టికలో ఇవ్వక విడిచిపోయిన కృతి శంకరాభరణ రాగమునందు "దేవిమీన నేత్రి".

నాకు లభించని ఇంకను రెండు రచనలున్నవి, అవి —

(1) బేగడ రాగమున "సామి నిన్నే నమ్మితిరా" అని వైద్దీశ్వరన్ గుడి ముత్తు కుమారస్వామి మీద నొక కృతి. ఒక చరణము అంకితము లేక యున్నది;

(2) సరుజా రాగమున కామాక్షి స్తుతిగా అరవములో "సంతతం ఎన్నై రక్షిప్పాయ్" అనియు సంస్కృతమున "కామాక్షి లోక సాక్షిణి" - రెండు సాహిత్యములును ఒకే ధాతువుననే పాడబడునవి, శాస్త్రులవారి అంకితము కలది.

శాస్త్రులవారు తమ ఇష్టదైవమైన కామాక్షి స్తుతిగా వ్రాసిన 3 స్వరజతులును, 15 కృతులును ఈ గ్రంథమున ఇవ్వబడియున్నవి. వేరు దైవముల మీద నుండునవి —

మధురమీనాక్షి 7; తంజపురి బంగారు కామాక్షి 1; తంజపురి బృహన్నాయకి 3; రాజరాజేశ్వరి 3 (1 వర్ణము, 2 కృతులు); ధర్మసంవర్ధని 2; పుదుకోట బృహదంబ 2; అఖిలాండేశ్వరి 1; నీలాయతాక్షి 1; కంచి వరదరాజ శృంగార రసస్తుతిగా తానవర్ణము 1.

గ్రంథమున ఇవ్వబడిన 38 కృతులలో 5 కృతులలో అంకిత చరణములు లేవు. బహుశ అవి దొరకలేదేమొ. అవి —

(1) ధన్యాసిలో "బాగాలోచన"; (2) పున్నాగవరాళిలో "బ్రోవసమయము"; (3) ఆహిరిలో "మాయమ్మయని"; (4)సావేరిలో "జననిం తజన"; (5) ముఖారిలో "పాలింపవమ్మ పరమ".

తోడిరాగమున "నిన్నే నమ్మినాను" అను కృతి సాహిత్యమున అంకిత చరణము మాత్రము ఇవ్వబడియున్నది. ఇంకను రెండు చరణములు గలవు. వాటిని జేర్చి యుండవలెనుగదా.

గ్రంథమున కొన్ని కృతులకు తాళములను మార్చియున్నవని యెంచెద, అవి —

(1) మూడు రచనలకు త్రిపుట తాళమని యున్నది—అవి చాపు తాళములోనివే;

(2) తోడిరాగమున "కరుణానిధి" రూపకతాళములోనిదే - తిస్రగతి అది ఏల;

(3) సరుజరాగమున "త్రిలోకమాత" కృతికి సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో చతురశ్ర ఏకతాళమని యున్నది. ఈ కాలమున చాపుతాళపు కృతియనియే చెప్పుచున్నారు;

(4) భైరవి రాగమున "సరియెవరమ్మా" కృతికి ఆదితాళమే సరిపోవును. ఖండజంపతాళమనుట ఏమని ఊహయో;

(5) ఆనందభైరవి రాగమున "హిమాచలతనయ" కృతికి చాపుతాళమని వ్రాసియున్నను దానిని ఆదితాళమున పాడుటయే నా అనుభవము.

రావుగారు ముద్రించియుండు 38 కీర్తనల సాహిత్యములలో 3 కీర్తనలు శాస్త్రులు రచించినవి కావని నా అభిప్రాయము, అవి—

(1) ముఖారి రాగమున "పాలింపవమ్మ"—శాస్త్రుల అంకితము లేని ఒక చరణము మాత్రము ఇవ్వబడియున్నది. సాహిత్యమున శాస్త్రులు ఈ కృతిని ఏ దైవముమీద పాడినారని సరిగా తెలియలేదు. సాహిత్యపు కడపట "ఎంతో భక్తితో నీకుడ" అను పదములున్నవి. వాటి అర్థము సరిగా స్ఫురించలేదు;

(2) కేదార గౌళ రాగమున "పరాకేలనను పరిపాలింప"— ఈ కృతి ఏ దైవముమీదయని సరిగా యివ్వబడలేదు. ఒక అంకిత చరణము ఇచ్చియుండినను ఈ కృతి వేరు రెండు అంకితములు గల విగా చూచియున్నాను, అవి "కృష్ణ" అంకితమును; పిదప "చిన్నికృష్ణ" అంకితమును;

(3) జనరంజని రాగమున "నన్ను బ్రోవరాదా" అను కృతికి శాస్త్రుల అంకితముగల యొక చరణ సాహిత్యము ఇచ్చియుండినను సాహిత్యమునకును దానికిగల ధాతువునకు సరిగా పొందిక కనబడలేదు. దాని ధాతువును గమనించి యున్నాను. రాగము బహుశా పూర్ణచంద్రికగా నుండవచ్చునని తోచుచున్నది. మరియు పై రెండు కృతులలోవలెనే ఈ కృతియందును శాస్త్రిగారు స్తుతించిన దైవము యొక్క పేరు స్పష్టముగాలేదు.

4. గ్రంథమున సాహిత్యముల ముద్రణకు వెనుక కడపటి భాగమున శాస్త్రులవారు వాడిన రాగములకు లక్షణములు ఇవ్వబడియున్నవి. వాటిలో—

(1) కన్నడ-సంగ్రహచూడామణి గ్రంథపు అనుబంధమున గల ఈ రాగపు లక్షణగీత సాహిత్యమున ఈ రాగము పేరు "కన్నడ" యని ఇవ్వబడియున్నది;

(2) ఆహిరి-20వ మేళపు లేదా 8వ మేళపు జన్యమని తలచవలసిన ఈ రాగమును అంతరగాంధారము అన్యస్వరముగా వచ్చు కారణమున 14వ మేళమైన వకుళాభరణ జన్యమని చెప్పుట ఉచితముకాదు. ఈ రాగమున చతుశ్శ్రుతి దైవత ఋషభములును, కాకలి నిషాదమును కూడా అన్య స్వరములుగా కొన్ని సంచారములలో గలవు;

(3) లలిత-శుద్ధదైవతము మాత్రమే గల ఈ రాగమును అన్ని లక్షణ గ్రంథములలోను 15వ మేళమైన మాయామాళవగౌళ ఉపాంగ జన్యముగానే తెలుపబడియున్నది. అట్లుండినను కొందరు గాయకులు పొరబాటుగా ఈ కాలమున బహుశ వివరము తెలియక ఈ రాగమును చతుశ్శ్రుతి దైవతము గలదిగా పాడు కారణమున ఈ రాగమును 17వ మేళమైన సూర్యకాంత జన్యమని యెంచవలెనా;

(4) గౌళిపంతు-15వ మేళ మాయామాళవగౌళ జన్యమైన ఈ రాగమును కొందరు నవీన గాయకులు దాని సరియైన లక్షణరూపము తెలియక శుద్ధ మధ్యమమునకు బదులు పొరబాటుగా ప్రతిమధ్యమము గలదిగా పాడుచున్నారు;

(5) 20వ మేళమైన నఠభైరవి జన్యములైన ఆనంద భైరవి, ముఖారి, ఆభేరి రాగములను 22వ మేళ ఖరహరప్రియ జన్యములుగా ఇచ్చియుండుట ఏల? ఇట్లు మార్చుటవల్ల కడపట 20వ మేళమునకు జన్యముగా నొక రాగమైన యుండునో లేదో. ఈ నఠభైరవి మేళరాగము ఏ రాగరసము లేకయున్నదనుట తెలిసినదే;

(6) ఆభేరి-ఈ రాగము 3 విధములుగా నున్నది.

i వెంకటమఖి ఆభేరి-దీనిలో దీక్షితులవారి కృతి "వీణాభేరి" యున్నది;

ii సంగ్రహచూడామణి ఆభేరి-

ఇవి రెండును శుద్ధదైవతము గలవియే;

iii త్యాగయ్యగారి "నగుమోము గనలేని" అను కృతికి చెప్పబడు ఆభేరి చతుశ్శ్రుతి దైవతము గలదిగా వినుచున్నాము. అయ్యగారు ఈ కృతిని పాడిన రాగమును చెప్పలేదు. బహుశ తచ్చూరు శింగరాచార్యులు అయ్యగారి కృతులకు రాగములను వ్రాయుచున్నప్పుడు ఈ కృతికి ఆభేరి రాగమని వ్రాసియుండవచ్చును.

బాల్యమునుండి నేను వినియు, నేర్చియు రీతి గౌళరాగమున నుండవలసిన "నిన్ను వినామరిగలదా" అను శాస్త్రులవారి కృతిని-సమీప కాలమున (ఈ కృతి) ఆభేరి రాగములోనిదనియు, దానిని ఆభేరి రాగమున (శుద్ధదైవతము గలదిగా) ముడికొండాన్ వెంకటరామయ్యర్ వారు స్వరపరచి ఒక పాఠమును ఇచ్చియున్నారు. అయితే ఈ కృతిని గాయకులెవరును ఈ ఆభేరి పాఠమునపాడి నేనింత వరకు వినలేదు.

(7) చింతామణి-లక్షణ గ్రంథములలో 3 వేరు వేరు చింతామణి రాగములను 3 వేరు వేరు మేళకర్తల జన్యములుగా చూపబడియున్నవి. అయితే 56వ మేళమైన షణ్ముఖప్రియ జన్యముగా ఒక చింతామణియు కనబడలేదు. ఈ నూతన చింతామణి ఏ సరస్వతీదేవి కల్పనయో! శాస్త్రులవారి కాలమున ప్రచారములోలేని, ఎవరు ఎరుగని, ఈ నూతన రాగమున ఈ కృతిని రచించెనో లేక దానిని వేరొక రాగమున రచించెనో తెలియదు. సమీపమునసే ఈ రాగము "చింతామణి"యను క్రొత్తపేరు గలదిగా 56వ మేళ జన్యమని Prof. సాంబమూర్తిగారి ప్రచురము నొకదానిలో జూచితి. గనుక ఈ క్రొత్తరాగము బహుశ Prof. సాంబమూర్తివారి కల్పనగానే యుండునేమో!

5 సాహిత్యములను చక్కగాను విశదముగాను నెరుగుటకై వాటి పాదములను వేరువేరు పంక్తులుగా వ్రాసి ముద్రించియుండిన మిక్కిలి ఉపయోగముగ నుండును. ఇది ముఖ్యమైన విషయము.

ఇట్లు సాహిత్య రచనల (మాతువుల) పాదములు వేరు వేరుగా నెరుగుటకై రచన విధులు గలవు. వాటి ప్రకారము యతి ప్రాసాక్షరములు పాదముల మొదటి అక్షరములుగా రచనకర్త లను

యుండునవి. మరియు సీతగర్భాక్షరము, అంత్య పాసాక్షరములుకూడా ఈ విషయమున అతిముఖ్యములై యుండును. సంగీత త్రిమూర్తులలో నొకరును ఉత్తమ వాగ్గేయకారులైన శ్యామాశాస్త్రులు ఈ రచన విధానము తమ సాహిత్యరచనలలో అతిశ్రద్ధగా అనుసరించి యుండుట విశదముకదా.

6. గ్రంథమునగల 3 స్వరజతులును, 2 తానవర్ణములును మాత్రము వాటి ధాతువులను స్వరసహిత నొటేషనులలో ఇవ్వబడి యున్నవి. ఈ కాలమున స్వరజతులని చెప్పబడు ఈ మూడును కృతి రచనములే యని ఎరుగవలెను. స్వరసహిత 3 స్వరజతులకును వాటి సాహిత్యములను ముందుగా ముద్రించి యుండునట్లు వాటి వెనుకగల 2 తానవర్ణములకు మాత్రము వాటి సాహిత్యములను ప్రత్యేకముగా ఇవ్వలేదు. అట్లు ఇచ్చియుండిన ముఖ్యముగా అట తాళవర్ణమున నుండు స్వరసాహిత్యములు విశదముగా తెలుసుకొనుటకు తోడ్పడి యుండునుకదా.

స్వరసహిత ఇవ్వబడిన నొటేషనుల పట్టికలలో అనేక తప్పులు కనబడుచున్నవి. మరియు ఆవర్తపు లఘు-ధృత అంగములను సరిగా తెలుపలేదు. మంద్రస్థాయి స్వరములను తెలుపు వాటిక్రింద వేయవలసిన చుక్కలు కనబడలేదు.

స్వరజతులు తానవర్ణములకు వెనుక 38 కృతులను వాటి ధాతువులను తెలుపుటకు స్వరనొటేషను లేనట్టి సాహిత్యములు మాత్రము ఇవ్వబడియున్నవి. రాగముల ఆరోహణావరోహణములను గ్రంథము చివర ప్రత్యేకముగ ఇవ్వబడిన రాగలక్షణములను ఇవ్వబడి యున్నను వాటిమూలముగా కృతుల ధాతువులను ఎవరు తెలియలేరు, నేర్వలేరు. గాయకుడుగాని, విద్యార్థిగాని ముందుగనే ఈ కీర్తనలను నేర్చియుండి వాటిలోగల సాహిత్యములను మరచియుండినవారికి ఈ గ్రంథమును జూచి జ్ఞప్తికి తెచ్చుకొనుటకు మాత్రము వీలగును. అంతే. ఈ కాలమున వాద్యకారులు కృతుల సాహిత్యములకు కొంచమైనను ముఖ్యతను ఇచ్చుటలేదని తెలిసినదే. వారికి ఈ గ్రంథము వల్ల ఏమియు ఉపయోగముండదుగదా.

7. గ్రంథమున ఇవ్వబడిన సాహిత్యముల ముద్రణలలో అనేక అక్షరలోపములును, అర్థమును మార్చు అక్షర భేదములును, ఉండదగని అక్షరములును పదములును కూడా కొన్నిచోట్ల చేర్చబడియు కనబడుచున్నవి. కొన్నిచోట్ల అవశ్యమైన అక్షరములును పదములునుకూడా ముద్రింపబడక విడిచిపోయి యున్నవి.

ఉదా : (1) తోడిరాగమున "కరుణానిధి" కృతిలో నొక పాదము

"మహిమాతిశయంబుల...నెంతటివాడను" అని యున్నది ఈ పాదము "మహిమాతిశయంబుల" గానని "నెంతటివాడను" అని యుండవలెను;

(2) మధ్యమావతి రాగమున "పాలించు కామాక్షి" కృతి యొక్క అనుపల్లవి రెండవపాదము "ఈలాగు...జేసేవు-" అను పాదమున "జాగు" అను పదమును చేర్చి "ఈలాగు జాగు జేసేవు" అని యుండవలెను.

ఇట్లు ఈ గ్రంథమునగల ముద్రణపు తప్పులను గమనించి యొక తప్పొప్పుల పట్టిక ఇచ్చియుండిన బాగుండును. అది అవశ్యము. ఈ గ్రంథపు మరొక ప్రచురమునందైన తప్పులను సవరించి యిత్తురని నా ప్రార్థన.

—శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.